K-100

# సర్దార్ పృథ్వీసింగ్

[జీవిత చరిత్ర]

•

రచయిత

చంద్రం

•

ప్రజాప్రచురణాలయం, హైదరాబాదు.

A

# తొలి పలుకు

వీరుల జీవిత చరిత్రలను వినడానికి ప్రజలు చెవులు కోసికుంటారు. వీరుల జీవితాలనుండి యువకులు ప్రజాసేవ చేయాలనే ఉత్సాహం పొందుతారు. ఒక్కొకవీరుని జీవితగాథ అనేకమందికి మార్గదర్శకమవుతుంది: ప్రజాసేవకులను, దేశభక్తులను తయారుచేస్తుంది.

పృధ్వీసింగ్ జీవితచరిత్ర అనేక భీషణ సంఘటనలతో, సాహస కృత్యాలతో నిండివుంది. 'మాతృదేశ విముక్తి', 'భారతస్వాతంత్ర్యం' అనే వినాదాలు పృధ్వీసింగు జీవితానికి చుక్కానివంటివి. ఆ దివ్యవాణి చెవులలో యెల్లపుడూ గింగురు మంటూండుటచేతనే పృధ్వీసింగు యెట్టి కష్టాలైనను లెక్కచేయకుండా తన జీవితాన్ని స్వాతంత్ర్యోద్యమానికి అంకితం చేశాడు. నిజంగా పృధ్వీసింగ్ జీవిత విశేషాలు వింటూంటే వాస్తవ ఘటనలే యెంత అద్భుతంగా వుంటాయి? అనిపించుతుంది.

వీరుడు - దేశభక్తుడు అయిన పృధ్వీసింగు జీవితాన్ని యీ చిన్ని పుస్తకం తెలుపుతుంది. గాంధీజీ కోరికపై 1939 లో లాహోరు జైలులో వుండగా పృధ్వీసింగు తన ఆత్మకథను వ్రాశాడు. అది చాల దీర్ఘంగా 450 పైపు పేజీలుంది. కాగితం కరువురోజులగుటచే అంత పెద్దపుస్తకం అనువదించడానికి జంకాను. సంగ్రహపరచి క్లుప్తంగా వ్రాశాను. ఆత్మపరంగా పృధ్వీసింగు చెప్పిన కథను ప్రథమ పురుషలో జీవితచరిత్రగా మార్చాను. కాని చరిత్రకు, సంఘటనలకు పృధ్వీసింగు ఆత్మకథే మూలాధారం.

ఆంధ్రులు దీనిని ఆదరించి చదువుతారని ఆశించుతాను. యువజనులు యీ వీరుని జీవితాన్నుంచి ఉత్సాహంపొంది దేశభక్తులుగానూ, ప్రజాసేవకులుగానూ తయారవుతారని ఆశించుతాను.

36 వ పేజీలోవున్న 'సైరా కర్తారువీర' అను పాటను పుస్తకం చివరవున్న 'పృధ్వీసింగ్ జిందాబాద్' అనే పాటను మిత్రుడు, విద్వాన్ ప్రయాగ కోదండరామశాస్త్రిగారు వ్రాసియిచ్చారు. అడిగినంతనే యీ పాటలు వ్రాసియిచ్చినందులకు శాస్త్రిగారికి కృతజ్ఞతాభివందనాలు.

1-7-1944. రచయిత.

# విషయసూచిక

## మొదటిభాగం



## రెండవభాగం



## మూడవభాగం



## నాలుగవభాగం

ప్రపంచయాత్ర



## ఐదవభాగం

# మొదటి భాగం

## బాల్యం

(1892 – 1902)

సింధునది అయిదు ఉపనదులతోనూ ప్రవహించి పవిత్రంజేస్తున్న పంజాబురాష్ట్రం. పాటియాలా సంస్థానం, అంబాలా కంటోన్మెంటు నుంచి ఒక రైలుదారి సిమ్లావైపు పోతుంది. అదే మార్గంలో అంబాలాకు రెండవ స్టేషన్ అయిన "సారక్‌పూర్ తాబక్" అనే ఒక చిన్నగ్రామం.

ఆ వూళ్ళో రాజపుత్రవంశానికి చెందిన ఒక బీదరైతు ఉండేవాడు. అతనిపేరు షాదీరామ్. ఈ బీదరైతు కుమారుడే భారత స్వాతంత్ర్యోద్యమంలో ప్రఖ్యాతిగాంచిన పృధ్వీసింగు. 1892 వ సంవత్సరంలో పృధ్వీసింగు జన్మించాడు.

భారతదేశంలో నాటిపరిస్థితులు ఎలావున్నాయ్? 1857 ప్రథమ స్వాతంత్ర్యపోరాటం ఓడిపోయింది. ప్రజలు తిరుగుబాటుచేస్తే సామ్రాజ్య రక్షణ ఎంతకష్టమో బ్రిటీషు సామ్రాజ్యవాదులు గ్రహించారు. అందుచే సైన్యాలను సరఫరాచేసి తమ ప్రభుత్వాన్ని కాపాడుకోడానికి, తమ సరకులను రవాణాచేసి లాభసాటిగా అమ్ముకోడానికి, దేశంలోవున్న ముడి పదార్థాలను కొని తీసుకుపోడానికి, రైలుమార్గాలను నిర్మించారు.

అంతవరదాకా చేతి పరిశ్రమలు, వ్యవసాయంపై భారతదేశ ఆర్థిక విధానం ఆధారపడి వుండేది, క్రమంగా సీమనుంచి దిగుమతి అయ్యే వస్తువుల పోటీకి ఆగలేక భారతదేశంలోని చేతిపరిశ్రమలు మూలబడ్డాయి. వ్యవసాయ మొక్కటే ప్రజానీకానికి జీవనాధారంగా మిగిలింది. గ్రామ ప్రజల జీవితావసరాల వుత్పత్తికి ఆధారమైన ప్రాంతీయ ఆర్థికవిధానం రైల్వేల నిర్మాణంతో భగ్నమయింది. ప్రపంచ మార్కెటుకు ముఖ్యంగా బ్రిటీషు యంత్ర పరిశ్రమలకు ముడిపదార్థాలు సప్లయిచేసే బానిసదేశమయింది భారతదేశం.

దీనికి ఫలితంగా పంధొమ్మిదో శతాబ్దం చివరిభాగంలో అదివరకెన్నడూ కనివిని యెరుగని కరువు కాటకాలు దేశమంతటా వ్యాపించాయి.

లక్షలకొలది ప్రజలు ఆకలిమంటలకు బలి అయ్యారు. అంటు వ్యాధులు లక్షలమందిని ఆహుతిగొన్నాయి. తిండిలేక పొట్ట చేతపట్టుకొని అనేక మంది భారతీయులు ఆఫ్రికా, అమెరికా, బర్మా వగైరా యితరదేశాలకు వలసపోతున్న రోజులవి.

కరువు తాకిడి బీదరైతగు షాదీరాం కుటుంబానికికూడా తగిలింది. బాలుడైన పృథ్వీసింగ్‌ను, తల్లిని, పొత్తిళ్ళలోవున్న మరో పసికందును తాతగారికి అప్పగించాడు; షాదీరామ్ తన మాతృభూమిని వదిలాడు. తన భుక్తికోసం, సంపాదించి కుటుంబానికి పంపడంకోసం షాదీరామ్ బర్మాకు వలసవెళ్ళాడు.

పృథ్వీసింగ్ తాత - ముసలివాడు - గింజలకోసం ఒక్కొక్కసారి 20 మైళ్ళవరకు తిరిగివచ్చేవాడు. ఐనప్పటికీ అనేకసార్లు పస్తుండవలసి వచ్చేది. ఈ కఠినమైన జీవితాన్ని భరించలేక ఆరోగ్యం గోల్పోయి కొలది కాలంలోనే పృథ్వీసింగ్ తల్లి చనిపోయింది. ఇంక ఆడదిక్కులేదు. ముసలితాత ఒకడే పిల్లలనిద్దరినీ సాకవలసివచ్చేది.

తరువాత మేనమామ యీ పిల్లలనిద్దరిని తన రక్షణలోకి తీసుకున్నాడు. సారిక్‌పూర్ చాలా చిన్నవూరు. ఆ పల్లెలో బడి అనేది లేనే లేదు. అచటికి 4 మైళ్ళలో ఒక బడివుంది. అంతదూరం నడచివెళ్ళే శక్తి పసిబాలుడగు పృథ్వీసింగ్‌కు లేదు. అందుచే మేనమామ చదువు చెప్పించాలనుకొన్నా సాధ్యపడలేదు. గ్రామాలలో రైతుకుటుంబాల బాలురకు గొడ్లను కాయడం తప్పనిసరి అయినట్లుగానే, పృథ్వీసింగ్‌కు కూడా గొడ్లను కాయడం తప్పలేదు. పశులకాపరిగా తనకాలం వెళ్ళబుచ్చేవాడు పృథ్వీసింగ్.

పృథ్వీసింగ్ మేనమామలు నలుగురు. వారందరికీ తుపాకులుండేవి. తరుచుగా రాత్రిళ్లు వేటకువెళ్ళే మామలతో పృథ్వీసింగుకూడా బల్లెం పుచ్చుకొని వెంబడించేవాడు. మేనమామ మాటువేసుకొని ఎలుగును తుపాకితో గురిచూచి కొట్టునపుడు ప్రక్కనే ఇతడు బల్లెం పుచ్చుకొని నిలబడేవాడు. పొలం కాపలాకు చీకటి రాత్రిళ్ళలోసైతం మామలతోపాటు పృథ్వీసింగు వెళ్ళుతుండేవాడు.

ఈవిధమైన జీవితంవల్ల పృథ్వీసింగుకు బాల్యంలోనే ధైర్యసాహసాలు పెంపొందాయి. అడవిమృగాలు, దెయ్యాలూ అంటే భయం ఏమాత్రం లేకుండా పోయింది. చదువు - సంధ్యలకు అవకాశం లేక

పోయినా యీకాలంలో అలవడిన నిర్భీతియే తరువాత జీవితంలో విప్లవ కారియై చేసిన అనేక సాహసకృత్యాలకు పునాది అయింది.

ఆకలిబాధ, పెంచిన మేనమామనుకూడా బర్మాకు తరిమింది. అచట అతడు పోలీసు గుర్రపుదళంలో చేరాడు. తరువాత అతడు 'పోలో' ఆటగాడుగా ప్రఖ్యాతిచెందాడు. ఆరు అడుగుల ఆజానుబాహుడైన షాదీరామ్‌నుకూడా పోలీసుదళంలో చేర్చుకోడానికి అధికారులు ప్రయత్నించారు. కాని పృధ్వీసింగుతండ్రి అందుకు యిష్టపడలేదు. పాలమనిషిగా తన వృత్తిని ప్రారంభించాడు, క్రమంగా వ్యాపారం వృద్ధిగాజొచ్చింది.

ఈలోగా తండ్రికోరికపైన పృధ్వీసింగును పాఠశాలకు పంపించారు. క్లాసులో పిల్లలందరికంటే పెద్దవాడుగా వుండుటచే పృధ్వీసింగ్ బిడియపడేవాడు. ఇంతలో మేనమామ యింటికి తిరిగివచ్చాడు. బాకీలు తీర్చివేశాడు. పెండ్లిచేసుకొన్నాడు. కుటుంబంతోసహా పృధ్వీసింగును, తమ్ముణ్ణి వెంటతీసుకొని బర్మాకు ప్రయాణమయ్యాడు.

పృధ్వీసింగుకు ఊహ తెలిశాక తండ్రి కొడుకులకు యిద్దరకు అదే ప్రధమ పరిచయం. బర్మాలో తండ్రివద్దకుచేరిన తన పుత్రులను చూచుకొని షాదీరామ్ ఎంతో మురిసిపోయాడు.

••••○○•••

## విద్యార్థిదశ

### ( 1903 – 1909 )

పృధ్వీసింగు బర్మా చేరేటప్పటికి తండ్రి షాదీరాం పాల వ్యాపారం బాగా సాగుతోంది. 20 ఆవులు, 2 వేల గొర్రెలు - మేకలు వుండేవి. రెండు ఇండ్లనుకూడా సంపాదించాడు. ఆర్థికస్థితి సంతృప్తికరంగావుంది. షాదీరామ్ కుమారుణ్ణి ఆదరించాడు. వృత్తిలో తనకు సాయంచేయడమో లేక స్కూలుకుపోయి చదువుకోడమో ఏదో ఒకటి కోరుకోమన్నాడు. చదువుకోవాలని ఉవ్విళ్లూరుతున్న పృధ్వీసింగ్ బడికే పోతానన్నాడు సంతోషంతో.

పృధ్వీసింగ్ 'మనేయ్యా'లోని మిషన్ హైస్కూలులో చేరాడు. బర్మా భాష తెలియదు. ఇంగ్లీషురాదు. అందుచే మొదట్లో పాఠాలు అర్థం

చేసుకోడానికి చాలా కష్టపడవలసివచ్చేది. కాని కొలదికాలంలోనే బర్మా భాష నేర్చుకున్నాడు. క్లాసు పాఠాలు అనుసరించగలిగాడు.

బడినుండి ఇంటికివచ్చాక గృహకృత్యాలలో పృధ్వీసింగు తండ్రికి సాయపడేవాడు. వంటమనిషి లేకపోవుటచే వంటకూడ తండ్రీ కొడుకులే చేసుకొనేవారు. ఇలా యెల్లపుడూ పనిలో నిమగ్నుడవడంచేత తోడి బాలబాలికలతో ఆటలాడుకొనే అవకాశం పృధ్వీసింగ్‌కు దొరికేది కాదు.

తండ్రి షాదీరామ్ మతవిశ్వాసాలు గలవాడు. తరచుగా బౌద్ధసన్యాసులతో సంభాషించుతూండేవాడు. తండ్రి భక్తివిశ్వాసాలే పృధ్వీసింగుకు కూడా అలవడ్డాయి. ఒకసారి 8 మైళ్లు నడచివెళ్ళి పర్వతంపై కూర్చుని భగవంతునిలో లీనమవ్వాలని ధ్యాననిమగ్నుడయ్యాడు. సాయంకాలమయే టప్పటికి ఆకలివేసింది తపస్సువదలి ఇంటిముఖం పట్టాడు. ఇంతలో ఆతడు కనపడలేదని వెదకుచూన్న స్నేహితులు అతన్ని చూచారు; ఇంటికి ఈడ్చుకుపోయారు. తండ్రి కొడతాడని పృధ్వీసింగు భయపడ్డాడు. కాని షాదీరామ్ ఆసంగతే ఏమీ మాటాడలేదు. కుమారుని బుజ్జగించి వదలి వేశాడు.

1907 లో పంజాబు నాయకుడగు లాలా లజపతిరాయిని బ్రిటీషు ప్రభుత్వం 'మాండలే'కు ప్రవాసం పంపింది. ఈ విషయమై ప్రజలలో తీవ్రమైన కల్లోలం బయలుదేరింది. ఈ ఆందోళన బర్మాలోకి కూడ వ్యాపించింది. పృధ్వీసింగ్ అప్పటికి నాల్గవ ఫారము చదువుతున్నాడు. ఈ వార్త ఆ బాలునిలోకూడ దేశభక్తినీ, వుద్రేకాన్నీ రగిల్చింది.

పృధ్వీసింగ్ యెల్లప్పుడూ సర్ వాల్టర్‌స్కాట్ కవి వ్రాసిన యీ క్రింది పద్యాన్ని యెల్లప్పుడూ మననం చేసుకొనేవాడు :

" Breathes there the man with soul so dead
Who never himself hath said;
This is my own native land."

" నా దేశంబిది నాయది యనుచున్
మోదమునందని మోరకుడున్నే "

నాల్గోఫారం ప్యాసయినాక, పృధ్వీసింగ్ మాతృదేశానికి వెళ్ళడానికి తండ్రిని అనుమతి అడిగాడు. అంబాలా స్కూలులో చదువుకుంటానన్నాడు. తండ్రికి కొడుకును విడిచివుండటం కష్టంగావున్నా కుమారుడు చదివి గొప్పవాడు అవుతాడనే ఆశతో అంగీకరించాడు.

## తిరిగి భారతదేశంలో

పంజాబ్ వెళ్లుతున్న కొందరు బాలురతో కలిసి పృథ్వీసింగ్ భారత దేశానికి వచ్చాడు. సూటిగా చిన్ననాట పెరిగిన యింటికి వెళ్ళాడు. కాని అచట అన్నీ కొత్తముఖాలే. వారెవరూ పృథ్వీసింగ్‌ను గుర్తుపట్టలేదు. ఎవరో దూరపు చుట్టాలు మాత్రం కనుపించారు. ఇంక ఒకనిమిషం కూడ అచట ఆగడానికి పృథ్వీసింగ్ యిష్టపడలేదు. తిన్నగా అంబాలా నగరం వెళ్ళాడు; బోర్డింగు స్కూలులో చేరాడు.

కాని యిచట మళ్ళీ చిక్కువచ్చింది. పృథ్వీసింగ్‌కు ఇంగ్లీషు, బర్మా భాషలువచ్చు. హిందీగాని, ఉర్దూగాని తెలియదు. అందుచే నాలుగవ ఫారంలో మాత్రమే చేర్చుకున్నారు. ఉపాధ్యాయులు, తోడివిద్యార్థులు కూడ యీ భాషలు నేర్చుకోడానికి పృథ్వీసింగ్‌కు సాయం చేశారు బాగా చదివి ఒక ఏడాదిలోనే 4, 5, 6 ఫారాలను కూడ పృథ్వీసింగ్ పూర్తి చేయ గలిగాడు. తరువాత రాజపురా స్కూలులో చేరాడు.

కాని యింతలో పృథ్వీసింగ్ చదువుకు మళ్ళీ ఆటంకం వచ్చింది. తండ్రివద్దనుంచి రావలసిన డబ్బుసాయం ఆగిపోయింది. కొన్నినెలలుగా జాబులు కూడ రావడంలేదు. తండ్రికి ఏమైనా చిక్కులు వచ్చాయేమోనని పృథ్వీసింగ్ భయపడ్డాడు. ఆతురతతో మరల బర్మాకు ప్రయాణం కట్టాడు.

చదువుమాని వచ్చివేసినందుకు షాదీరామ్ కుమారుణ్ణి కోప్పడ్డాడు. భూమిని తాకట్టుపెట్టి అయినా చదువు పూర్తిచేయాలసిందన్నాడు.

తరువాత పృథ్వీసింగ్ కొలదికాలం ఉద్యోగం కోసం ప్రయత్నించాడు. పోలీసు సబ్‌ఇన్‌స్పెక్టరు ఉద్యోగం దొరికేదే. కాని తండ్రికిఇష్టం లేనందున దానిలో చేరలేదు. పోష్టాఫీసులో గుమాస్తాగా కొన్ని రోజులు పనిజేశాడు. కాని అదీ అతనికి నచ్చలేదు. అందుచే వదలివేశాడు.

యౌవనోత్సాహం పృథ్వీసింగ్‌లో ఒకవిధమైన అలజడిని, అసంతృప్తిని కలుగజేసింది. సాధారణంగా ఆ వయస్సులోవున్న యువకులవలె అతడు స్నేహితురాండ్ర సహవాసం కోసం ఆతురతపడలేదు; ఏ బర్మా యువతినైనా పెండ్లాడాలనే యిచ్ఛ జనించలేదు; తండ్రిచేసే వ్యాపారంలోనూ పాల్గొనడానికి యిష్టపడలేదు.

ఏదో అనిర్వచనీయమైన అసంతృప్తి ఎల్లప్పుడూ వుండేది. ఎవరితోనూ కలసి వుండేవాడుకాదు. ఎల్లప్పుడూ మాతృదేశాన్ని గురించి ఆలో

చించుతూండేవాడు. ఎలా స్వాతంత్ర్యం సంపాదించ గలుగుతామా అనే ప్రశ్న అతని ఎదుట ప్రత్యక్ష మౌతూండేది.

షాదీరామ్ కుమారుని చూచి విస్తుపోయేవాడు. "వాడి ఊహలేమో వాడికున్నాయి. నాకు ఏవిధంగాను పనికివచ్చేలా లేడ"ని తన మిత్రులతో అనేవాడు. పృథ్వీసింగ్ వింత ప్రకృతి సంగతివిన్న మిత్రుడొకడు అతనిని ఆరోగ్య ప్రదేశానికి పంపమని షాదీరామ్‌కు సలహా యిచ్చాడు.

పృథ్వీసింగ్ తండ్రి బొక్కసంలోనుంచి వందరూపాయలు తీసుకున్నాడు. కాని అతని గమ్యస్థానం ఆరోగ్య కేంద్రంకాదు. ఎచటికో ప్రయాణం! అతనికే తెలియదు. తన మాతృభూమి సంకెళ్ళను తొలగించడానికి కృషిచేయాలి. అందుకొరకు పనిజేసే దేశభక్తుల మధ్యకు వెళ్ళాలి. అదే అతని గమ్యస్థానం!

# ప్రపంచ భ్రమణం

(1909 – 1914)

పృథ్వీసింగ్ వందరూపాయల డబ్బుతో బయలుదేరాడు. కాని ఆరోగ్య కేంద్రానికి వెళ్ళలేదు. రంగూన్ నగరం చేరాడు. స్టేషనులో దిగాక ఎచ్చటికి వెళ్ళాలో తెలియదు. నగరంలోని విలాసాలు అతనిని ఆకర్షించలేదు. సందర్భవశాత్తు యిద్దరు పంజాబీ యువకులు కలిశారు. వారు ఉద్యోగాలకోసం వెతుకుతున్నారు. టెలిగ్రాఫ్ పరీక్షకు వెడుతూ పృథ్వీసింగునుకూడ రమ్మన్నారు. కాని అతడు దానికి ఆకర్షించబడలేదు.

ఆకస్మికముగా చైనాకు వెళదామనే ఊహ కలిగింది. వెంటనే పృథ్వీసింగ్ ఓడరేవుకు వెళ్ళాడు. మలయాలోని 'పెనాంగ్'కు టిక్కెట్టు తీసుకొన్నాడు. ఓడకొరకు ఎదురు చూస్తున్నాడు. ఒక ఉద్యోగితో పరిచయం కలిగింది. అతడు మలయాలోను, హాంకాంగ్‌లోనూ భారతీయుల స్థితిగతులను తెలియజేశాడు. అచట జరిగే మోసాలను గురించీ, భారతీయుల నికృష్టజీవితాన్ని గురించీ తెలియజేశాడు. ఈ సంభాషణ పృథ్వీసింగ్ ముమ్ముందు జాగ్రత్తపడటానికి ఉపయోగపడింది.

ఓడ యెక్కి పృధ్వీసింగ్ 'పెనాంగ్' చేరాడు. అచట వైద్యపరీక్ష కోసం 15 రోజులు క్వారంటైన్ (qwarantain) లో వుంచారు. అచట కాపలాకాసే పోలీసుకు ఒకపిటీషను వ్రాసిపెట్టాడు. ఒక ఉద్యోగి ఆ పోలీసుకు చేసిన అన్యాయాన్ని గురించి ఆ పిటీషను వ్రాయబడింది. వెంటనే డిపార్టుమెంటల్ విచారణ జరిగింది. ఆ ఉద్యోగికి చీవాట్లు వచ్చినందున పృధ్వీసింగ్‌పై మండిపడ్డాడు.

పెనాంగ్‌లో ఉద్యోగం దొరకడం సులభమే. కాని పృధ్వీసింగ్‌కు అచట ఆగడం యిష్టంలేదు. ఓడపై సింగపూర్‌కు బయలుదేరాడు.

ఓడలో ఇద్దరు సింధుదేశీయులతో పరిచయం ఏర్పడింది. ముగ్గురూ సింగపూర్‌లో దిగారు. అచటి జీవితం పెనాంగ్‌కంటే బాగుంది. సింధు దేశీయులు సాయం చేస్తామన్నారు. కాని పృధ్వీసింగ్ ఆకర్షింపబడలేదు. ఏదో తెలియని ఆవేదన లాక్కుపోతూంది.

మళ్ళీ స్టీమరుపై హాంకాంగుకు బయలుదేరాడు. ఓడపై 1500 మంది చైనావాళ్లు, 100 మంది భారతీయులు వున్నారు. స్టీమరు తేనె తుట్టెలా మనుష్యులతో నిండివుంది. అది జూన్ నెల. భరించలేని మండు టెండలు కాస్తున్నాయ్. ప్రతిరోజూ ఎండదెబ్బకు కిక్కిరిసిన ఆ ఓడలోని చైనావాళ్లు ఒక డజనుమంది చనిపోయేవారు.

దోవలో తీవ్రమైన తుపాను ఎదుర్కొంది. అందుచే ఆరురోజులలో పూర్తిఅయ్యే ప్రయాణం 15 రోజులుపట్టింది. తుపాన్ దెబ్బకు డెక్కు మీది ప్రయాణీకులు అనేకమంది సముద్రంపాలయ్యారు. పృధ్వీసింగ్ బెడ్డింగు (పక్క) వగైరా కొట్టుకుపోయాయి. ఒక ట్రంకు మాత్రం మిగిలింది.

## హాంకాంగ్‌లో

15 రోజులకు ఓడ హాంకాంగ్ రేవు చేరింది. పృధ్వీసింగ్ సిఖ్ఖు గురుద్వారంలో మకాం పెట్టాడు. అచట ట్రంకులో వున్న డబ్బు కాస్తా ఎవరో దొంగిలించారు. చేతిలో దమ్మిడీకూడా లేదు. ఏదైనా పని దొరుకుతుందేమోనని తిరిగాడు. కాని లాభం లేకపోయింది.

ఇంతలో పంజాబునుంచి అమెరికా వెళుతున్న ప్యారీలాల్, బల్వంత సింగ్ అనేవారితో పరిచయం ఏర్పడింది. వారిద్దరూ భారత స్వాతంత్ర్యం కోరే దేశభక్తులు. బల్వంతసింగ్ జాతీయగీతాలు చక్కగా పాడి అందరినీ

ఉద్రేకపరచేవాడు. వారివద్దకూడా ప్రయాణపు ఖర్చులు లేవు. ఎవరైనా దయదలచి భోజనానికి పిలిస్తే ఆపూట జరిగిపోయేది. లేనిచో పస్తుండాలిసి వచ్చేది.

హాంకాంగ్‌లో వుండగా భారతసిపాయీలతో పృధ్వీసింగ్ సంబంధాలు ఏర్పరచుకొన్నాడు. రాజపుత్రసిపాయీలతో స్నేహం కలిసింది. వారు రోజూ భోజనానికి పృధ్వీసింగ్‌ను ఆహ్వానించేవారు. అచట తిని బల్వంతసింగ్‌కు అన్నం తెచ్చేవాడు. అలా కొంతకాలం గడిచింది.

ఈ సమయంలోనే చైనాలో సన్‌యెట్‌సేన్ నాయకత్వాన ప్రజాస్వామిక విప్లవం జరిగింది. రాజును తొలగించివేసి ప్రజానాయకుడు సన్‌యెట్‌సేన్ చైనా రిపబ్లిక్‌ను స్థాపించాడు. విప్లవాన్ని బలపరుస్తూ చైనా ప్రజలు హాంకాంగ్‌లోకూడ ప్రదర్శనాలు జరిపారు. వీటినే చరిత్రలో 'జడల' (Pig tails) ప్రదర్శనాలని పిలుస్తారు. (చైనావాళ్ళకు జడలుంటాయి) అపుడు ప్రతి చైనాపౌరుడు తన దేశాన్ని ఎలా ప్రేమించుతున్నాడో, మాతృదేశ విముక్తి అతనిలో ఎంత ఆత్మవిశ్వాసం కలిగించిందో పృధ్వీసింగ్ గమనించాడు. ఈ ప్రదర్శనాలు పృధ్వీసింగ్‌లో దేశభక్తిని మరింత రగుల్కొల్పాయి.

ఆ రోజులలో విద్యార్థులను, ప్రయాణీకులను తప్ప భారతీయులను అమెరికా రానివ్వడంలేదు. భారతీయులు వలసరావడానికి అనేక ఆటంకాలు పెడుతున్నారు. భాయి రతన్‌సింగ్ అనే జాతీయవాది పృధ్వీసింగ్‌కు 400 రూ. బదులు యిచ్చాడు. వారు యిద్దరూ కలసి ఫిలిప్పైన్ దీవులకు ప్రయాణమయ్యారు.

## మణీలాలో

ఫిలిప్పైన్ దీవులకు మణీలా ముఖ్యపట్టణం. ఆ నగరంలో దాదాపు 100 మంది భారతీయులున్నారు. అచట భారతీయులకు ఎట్టిగౌరవంలేదు. కాపలావారుగానూ, సిల్కు వర్తకులుగానూ, వారుంటున్నారు. కాపలావానికి నెలకు 80 రూపాయలు యిస్తారు. పృధ్వీసింగ్, రతన్‌సింగ్ లిద్దరూ సిల్కు వర్తకులవద్ద ఏజెంట్లుగా చేరారు. బట్టలు అరువు తీసుకొని తిరిగి అమ్మకం చేసేవారు.

కొద్దికాలంలో పృధ్వీసింగ్ హాంకాంగ్‌లో చేసిన అప్పు తీర్చివేశాడు. రతన్‌సింగ్ తగినంత డబ్బురాగానే అమెరికాకు వెళ్ళిపోయాడు.

పృథ్వీసింగ్ యితర భారతీయులతో కలసి బట్టల అమ్మకం చేస్తూం డగా ఒక సంఘటన జరిగింది. భారతీయులలో కొందరు తలగుడ్డలు చుట్టారు. వారిని చూచి పిల్లలు వింతగా వెంబడించసాగారు. బెడ్డలు వేశారు. ఈ విషయమై పోలీసులకు రిపోర్టుచేస్తే వాళ్లు వినిపించుకోకుండా వాళ్ళుకూడా అదేపనిజేశారు. అది చూచి పృథ్వీసింగ్ సహించలేక పోయాడు. పోలీసులతో దెబ్బలాడాడు. తరువాత పోలీసులారీ వచ్చింది. అరెస్టుచేసి స్టేషనుకు తీసుకెళ్ళారు.

పట్టణ ప్రెసిడెంటు క్షమాపణయిస్తే వదలివేస్తామని చెప్పాడు. కాని పృథ్వీసింగ్ అగౌరవమని నిరాకరించాడు. ఆ పట్టణంలోనే చౌదరీ బర్కాట్ ఆలీ అనే భారత మహమ్మదీయుడున్నాడు పృథ్వీసింగ్ అరెస్టు వార్త విన్నంతనే లాయరును తీసికొని డిఫెన్సు ఏర్పాట్లు చేయడానికి వచ్చాడు. ఇంక ఇది పెద్ద రభస అవుతుందని పోలీసులు భయపడ్డారు. క్షమాపణ చెప్పి పృథ్వీసింగును వదలివేసారు. ఆ భారత మహమ్మదీయు నికి తనదేశ సోదరునియెడల ఎంత అభిమానమో చూచారా! తాను ముక్కూ మొఖం యెరుగడు. తన దేశస్థుడు చిక్కుల్లో వున్నాడనగానే సహాయం చేయడానికి పరుగెత్తుకువచ్చాడు. ఒకే మాతృదేశపు బిడ్డలం అని అనుకోవడంలోనే ఎంత అప్యాయత వుందో చూచారా!

తరువాత పృథ్వీసింగ్ అమెరికా ప్రయాణానికి భారతీయ మిత్రులు సాయంచేశారు. సర్దార్ లాల్‌సింగ్ 150 డాలర్లు ప్రయాణపు ఖర్చులకు గాను అప్పు యిచ్చాడు. ఇంకొకరు విదేశ ప్రయాణాని కవసరమైన దుస్తులు కుట్టించారు. అమెరికాలో ఓడ దిగగానే ప్రయాణీకులు తమవద్ద 50 డాలర్లున్నాయని అధికారులకు చూపాలి; లేనిచో దేశంలో అడుగిడ నివ్వరు. మరో మిత్రుడు 50 డాలర్లు పృథ్వీసింగుకు యిచ్చాడు.

ఈ విధంగా భారతీయమిత్రుల సాయంవల్ల పృథ్వీసింగ్ కోర్కె నెరవేరింది. అమెరికాకు ఓడ ఎక్కాడు. అతనితోపాటు 50 మంది భారతీయులు అమెరికా ప్రయాణం చేస్తున్నారు. ఆ ఓడ బ్రహ్మాండమైనది. 35 వేల టన్నులది అన్ని సౌకర్యాలూ వున్నాయి. నలభై రోజులు ప్రయా ణంచేసి పసిఫిక్ మహాసముద్రం దాటి అమెరికా సంయుక్త రాష్ట్రాల పడ మటి తీరం చేరింది. సీటల్ ( Seital ) అనే ఓడరేవులో ఆగింది.

# అ మె రి కా లో

సీటల్ రేవులో దిగడంతోనే భారతీయ ప్రయాణీకులందరినీ అమెరికా సంయుక్తరాష్ట్రప్రభుత్వాధికారులు ఎవరెవరు ఏపనిమీద అమెరికా వస్తూందీ ప్రశ్నించారు. మనవారిలో చాలమందికి ఇంగ్లీషురాదు. అందుచే పృధ్వీసింగే తక్కిన భారతీయులందరితరపునా ప్రశ్నలకు సమాధానము యివ్వడంలో దుబాసీగా పనిచేశాడు. అంతా తలొక కారణం చెప్పి అమెరికాలో దిగడానికి అనుమతి పొందారు.

చివరకు పృధ్వీసింగ్ వంతువచ్చింది. "నామాతృదేశ శృంఖలాలు త్రెంచి స్వాతంత్ర్యం ఎలా సంపాదించాలో నేర్చుకోడానికి వస్తున్నానని" పృధ్వీసింగ్ అమెరికా రావడానికి కారణం చెప్పుకున్నాడు. అమెరికన్ ఉద్యోగి పృధ్వీసింగ్ వంక తేరిపారచూచాడు. 5 నిమిషాలు ఆలోచించాడు. భారతీయులంతా కొంపమునిగిందనుకున్నారు. పృధ్వీసింగ్‌కు దిగడానికి అనుమతి రాదనుకొన్నారు. కాని చివరకు ఆ ఆఫీసరు పృధ్వీసింగ్‌ను సంతోషంతో ఆహ్వానించాడు. చిరునగవుతో భుజం తట్టి దిగడానికి అనుమతి యిచ్చాడు.

భారతీయులంతా హోటల్లో దిగి ఆ రోజు నగరమంతా తిరిగారు. రైలుబండి ఎక్కి కాలిఫోర్నియా రాష్ట్రంలోని స్టార్‌టన్ పట్టణానికి పృధ్వీసింగ్ వెళ్లాడు.

అచట సర్దార్ మెహెర్‌సింగ్ వ్యవసాయదారుగా పనిచేస్తున్నాడు. అతడు అమెరికన్ గదర్‌పార్టీసభ్యుడు. అతని బంగాళాదుంపల పొలంలో పనిచేయడానికి పృధ్వీసింగ్ కుదిరాడు. రోజుకు 8 గంటలపని చేయాలి. రోజుకూలి 2 డాలర్లు యిచ్చేవారు.

ఆ పొలంలో పనిజేసేవారంతా భారతీయులే. ఆజానుబాహులు: కండపుష్టి గలిగిన సిక్కులు. పృధ్వీసింగ్‌కు మొదట ఆ పని కష్టంగానే వుంది. కాని కొలది రోజుల్లోనే అలవాటయింది.

అచటి కూలీలలో మాంసముతినడం, సారాయి తాగడం పరిపాటి. లేనిచో ఆరోగ్యం వుండదని చెప్పేవారు. ఆదివారం వారికి సెలవురోజు. నాడు భారత కార్మికులు తాగి బజార్లలో తందనాలాడేవారు. ఒకరోజున

బలవంతాన పృధ్వీసింగ్ చేతకూడ ఒక గ్లాసు త్రాగించారు. దానితో స్మృతి తప్పిపోయి భారతవిప్లవాన్ని గురించి వాగాడు.

మరునాడు హర్నామ్‌సింగ్ అను యువక మిత్రుడు, తాగి అలా ప్రేలడం ఎంతప్రమాదకరమో పృధ్వీసింగుకు తెలియజేశాడు. ఎన్నడూ తాగవద్దని సలహాయిచ్చాడు. ఆ మిత్రులిద్దరూ తాము అమెరికాలో వున్నంత కాలం కొన్నినియమాలు అనుసరించాలని శపథంచేసికొన్నారు. (1) ఫాన్సీ దుస్తులు ధరించకూడదు. (2) సాధ్యమైనంతవరకు కార్మికుల దుస్తులలోనే వుండాలి (3) నాటకాలకు, సినిమాలకు, నృత్యంచేసే హాల్సుకు వెళ్ళ కూడదు. ఆ విధంగా అచట భారతీయులలోవ్యాపించివున్న దురలవాట్లనుండి ఆ యువకమిత్రులు తమ్మతాము కాపాడుకున్నారు. భారతదేశ స్వాతంత్ర్యో ద్యమంలో తమ శక్తినంతను వినియోగించడానికి కృతనిశ్చయులయ్యారు.

అచట పనిజేసిన కాలంలో పృధ్వీసింగ్ కొంతడబ్బు సంపాదించి తాను దారిలోచేసిన అప్పులను తీర్చివేశాడు. తండ్రికి 600 రూపాయలు పంపించాడు.

## గదర్‌పార్టీ పుట్టుక

అమెరికన్ ప్రజలు వాషింగ్‌టన్ నాయకత్వాన బ్రిటీషు సామ్రాజ్య వాదులతో పోరాడి తమ స్వాతంత్ర్యాన్ని సంపాదించుకొన్నారు. తమ దేశంలో ప్రజాస్వామిక రాజ్యమైన రిపబ్లికును స్థాపించుకొన్నారు. రంగు విభేదాలు, ధనిక—బీదల భేదాలు వున్నప్పటికీ ఆ దేశంలో సంపూర్ణ స్వాతంత్ర్యం అమలులోవుంది. ప్రజలే తమ అధ్యక్షుణ్ణి, జడ్జీలను, శాసన సభ్యులను ఎన్నుకుంటారు.

అమెరికాలోని యీ స్వాతంత్ర్యవాతావరణం యొక్క ప్రభావం అచట పనిజేసే కార్మికులపై బడింది. వారు తమ మాతృభూమిని ప్రేమిం చడం నేర్చుకొన్నారు. తాము తెల్లవాళ్ళకు ఏవిధంగానూ తీసిపోమనే ఆత్మవిశ్వాసం వారికి ఏర్పడింది. భారతీయులకు ఆత్మవిశ్వాసం, ఆత్మ గౌరవం ఉదయించిన వెంటనే ఒకే ఒక ప్రశ్న వారికండ్ల యెదుట ప్రత్యక్ష మయ్యేది. మన దేశానికి స్వాతంత్ర్యం లేదేం? అనే ప్రశ్న యెదుర్కొ నేది. తమ బానిసత్వం తొలగించుకోవాలని, స్వతంత్ర భారతదేశాన్ని స్థాపించుకోవాలనే కోర్కెలు వుదయించేవి.

బాబా జ్వాలాసింగ్ అమెరికాలోని భారతీయులలో జాతీయచైతన్యం కలిగించడంలో చాల కృషిచేశాడు. భారతీయ విద్యార్థులను అతడు అమెరికాకు ఆహ్వానించేవాడు. కార్మికులలోనూ. విద్యార్థులలోను విప్లవభావాలను కలిగించడానికి తన ఆదాయమంతా ఖర్చుపెట్టేవాడు. ఆవిధంగా బాబా జ్వాలాసింగ్ అమెరికాలోని భారత జాతీయోద్యమంలోని ముఖ్యపాత్రధారులలో ఒకరని చెప్పవచ్చు.

ఆకాలంలో జరిగిన చైనా ప్రజావిప్లవప్రభావం భారతీయులపైన గూడా బడింది. టర్కీ. పర్షియాదేశాల చరిత్రకూడ భారతీయులను ఉత్తేజపరచింది.

లాలాహరదయాల్ ఇదేసమయంలో అమెరికాకు వచ్చాడు. భారతీయులందరూ అతనివైపు ఆకర్షించబడ్డారు. అతనిచుట్టూ చేరారు. జ్వాలాసింగ్. సోహన్‌సింగ్. షేర్‌సింగ్. ఉద్దామ్‌సింగ్. కర్తార్‌సింగ్. పండిత జగత్‌రామ్ ఈ మీటింగులో పాల్గొన్నారు. ఒక విప్లవపార్టీని స్థాపించాలనే నిర్ణయానికి వచ్చారు. గదర్‌పార్టీ నిర్మాణానికి పూనుకున్నారు.

వెంటనే అమెరికాలోని భారతీయుల తరపున 'శాన్‌ఫ్రాన్‌సిస్కో' నగరంనుంచి గదర్ (విప్లవ) పత్రిక వెలువడసాగింది. గదర్ పత్రిక పిలుపు భారతీయులందరినీ ఆకర్షించింది. ముఖ్యంగా అమెరికా, కెనడాలలోని భారతీయులలో జాగృతి. చైతన్యం కలిగించింది. దానికి చిహ్నంగా భారతీయులందరినుండి పత్రికకు డబ్బువర్షం కురిసింది.

భారతీయులలో గదర్ పత్రిక గల్గించిన చైతన్యానికి చిహ్నంగా ఒక ఉదాహరణ యిచట చెప్పవచ్చును. అంతకు పూర్వం ఒక ఆచారం వుండేది. ఇండియాలో కొంతకాలం పరిపాలన చేసిన ఇంగ్లీషువాళ్లు అమెరికాలో ఎచట భారతీయుల తలగుడ్డలు కనబడినా 'కలకత్తా, బొంబాయి, కరాచీ, మద్రాసు' అని అరచేవారు. అట్టివారిని భారతీయులు మర్యాద చేసేవారు. హోటలుకు తీసుకువెళ్ళి విందుచేసేవారు. ఆవిధంగా తాము భారతదేశం ఎరుగుదుమని, పాలించి వచ్చామనీ చెప్పుకొనే ఇంగ్లీషువాళ్లు భారతీయుల మన్ననలు పొందేవారు.

గదర్ పత్రిక వచ్చాక వాతావరణం పూర్తిగా మారిపోయింది. అలా అన్నవాడికి మర్యాదలేదు సరిగదా! తన్నులు ప్రాప్తించేవి. భారత నగరాల పేరు చెప్పుకొని మన్ననలకాశించే ఇంగ్లీషువాళ్ళను నెమ్మదిగా హోటలుకు తీసుకుపోయేవారు. త్రాగుడు పోయించి భారతీయులు తగవు

పెట్టుకొనేవారు. తన్ని పంపించేవారు. కొంతకాలం గడిచేటప్పటికి ఏ యింగ్లీషువాడూ భారతీయులను చూచిన వెంటనే 'కలకత్తా, బొంబాయి' అనే పేరు ఎత్తడానికి సాహసించేవాడుకాదు.

శాన్‌ఫ్రాన్‌సిస్కో నగరంనుంచి గదర్ పత్రిక వెలువడేది. స్వంత ప్రెస్సులోనే అచ్చువేసేవారు. ఈ ప్రెస్సులో దేశభక్తులైన 12 మంది భారత యువకులు పనిచేసేవారు. మొదట్లో అమెరికన్ ప్రభుత్వం చూచీ చూడనట్లు వూరుకుంది. లాలా హరదయాల్ సంపాదకుడుగా వుండేవాడు.

ఉద్యమం బలపడేకొలదీ బ్రిటీష్‌రాయబారి, సి. ఐ. డీ. లు అమెరికా ప్రభుత్వంపై ఒత్తిడి తేసాగారు. పోలీసులకు లంచంపెట్టి లాలా హరదయాల్‌ను అరెస్టు చేయించి ఇండియాకు పంపించివేశారు. ఇంతేగాక బ్రిటీషు సామ్రాజ్యవాదులు డబ్బిచ్చి అమెరికన్ పత్రికలలో భారత స్వాతంత్రోద్యమానికి వ్యతిరేకంగా వ్యాసాలు వ్రాయించసాగారు. భారతీయులకు వ్యతిరేకంగా ప్రచారం చేయించారు. భారత విప్లవకారులందరినీ అరెస్టుచేస్తారనీ, ఇండియాకు పంపించివేస్తారనీ వార్తలు పత్రికలో తాటికాయలంత అక్షరాలతో ప్రకటించబడ్డాయి.

ప్రెస్సులో పనిచేసేవారంతా అరెస్టు చేయబడతారని తెలిసింది. వారి స్థానంలో పనిచేయడానికి పృధ్వీసింగ్ లాస్‌ఏంజెల్స్ పట్టణం వదలి శాన్‌ఫ్రాన్‌సిస్కో నగరం వెళ్లాడు. ప్రెస్సులో డ్రయివరుగా పనిచేయ మొదలుపెట్టాడు. 'మణీలా'లో అతనికి డబ్బు సాయంచేసిన భాయీ రతన్‌సింగ్ కూడ ప్రెస్సులోనే పనిచేస్తున్నాడు.

హరదయాల్‌ను దేశాంతరం పంపాక ఉద్యమానికి అనుభవంగల నాయకుడు లేక అది చుక్కానిలేని పడవమాదిరి అయింది. అవకాశవాదులు, ప్రభుత్వ ఏజెంట్లు ఉద్యమంలోచేరి విచ్ఛిన్నం చేయడానికి పూనుకున్నారు. ప్రారంభంలో బారత కార్మికులు, ముఖ్యంగా సిక్కులు గదర్‌పార్టీకి వెన్నెముకగా వుండేవారు. బ్రిటీషు ప్రభుత్వపు సి. ఐ. డి శాఖ అగు స్కాట్లండు యార్డువాళ్ళు తమ ఏజెంట్లుగా కొందరు భారతీయ మేధావులను ఉద్యమంలోకి జొప్పించగలిగారు. ఇలా చేరిన ద్రోహులు వుద్యమానికి ఎంతో నష్టం కలిగించారు.

ఇలాంటి మోసగాండ్లలో ముఖ్యులు రామచంద్ర, భగవాన్‌సింగ్ గ్రంథీ అనేవాళ్లు. వీరు క్రమంగా పార్టీలో ఉన్నతస్థానాల్లోకి చేరారు. ఎంతో ద్రోహం చేశారు. తరువాత ' రామచంద్ర ' అనే వాడిని ద్రోహి

అని తెలిసికొన్నాక కోర్టు ఆవరణలోనే విప్లవకారులు కాల్చి చంపివేశారు. రెండోవాడు తరువాత రాజకీయాలనుండి విరమించాడు. బైరాగివేషంతో మోక్షం యిప్పిస్తానని అమెరికా వనితలను మోసంచేస్తూ తన దగావృత్తిని సాగించుతున్నాడు.

గదర్‌పార్టీలో మాతృభూమి స్వాతంత్ర్యం కొరకు సర్వస్వం అర్పించగల త్యాగులున్నారు. అగ్నిలో వురకమన్నా జంకని సాహస వంతులున్నారు. కాని అనుభవంగల విప్లవనాయకత్వం లేదు. భారత దేశంలో పరిస్థితులు ఎలావున్నాయో ఎవరికీ తెలియవు. గదర్‌పార్టీ నాయ కత్వం యింకా విప్లవానుభవం గడించలేదు. అప్పటివరకు గదర్‌పార్టీ ఆందోళన జరిపే సంస్థగానే వుండిపోయింది. భాయి శాంతసింగ్ మినహా ఎవరూ మేధావులు లేరు. ఆయన నాయకత్వం వహించడానికి ముందంజ వేయలేదు.

ఐనప్పటికీ ఉత్సాహం, వుద్రేకాలు పురిగొల్పి గదర్‌పార్టీ బలమైన బ్రిటీష్ సామ్రాజ్యాన్ని సూటిగా ఢీకొనసాగింది. అప్పటి తమ ఊహలను గురించి కామ్రేడ్ పృధ్వీసింగ్ యిలా తెలిపాడు :

" భారతదేశ పరిస్థితులు మాకేమీ తెలియవు. బ్రిటీషుసైన్యం ఎచట ఎంతవుందో మాత్రం తెలుసు. అంతే! బ్రిటీషు ప్రభుత్వం ఎంతలోతుగా పాతుకొనివుందో, దానిని బలపరచే వర్గాలేవో తెలియవు. మాలో కొందరం సావర్కారు వ్రాసిన 'ప్రధమ భారతస్వాతంత్ర్య యుద్ధం' అనే పుస్తకం మాత్రం చదివాము. నేను రాజపుత్ర సైన్యాలకు యిలా అప్పీలుచేయాలను కునే వాడిని 'మీ సోదరుడైన రాజపుత్రుడను. మాతృభూమి పేరుతో బ్రిటీషు ప్రభుత్వానికి వ్యతిరేకంగా తిరుగుబాటు చేయమని గోరుతున్నాను. మీ దేశాన్ని మీరు స్వాధీనం చేసికోండి! మీ ప్రభుత్వాన్ని స్థాపించు కోండి!' అని చెపితేచాలు అంతా మమ్ము అనుసరింరుతారనుకునేవాళ్ళం."

అమెరికన్ విప్లవకారులు గదర్‌పార్టీ మిత్రులకు సలహాలు యివ్వ డానికి ప్రయత్నించారు. ముందు టెక్నికల్ విజ్ఞానం సంపాదించమన్నారు. సర్దార్ కర్తార్‌సింగ్‌ను విమానం నడిపే విద్యను నేర్చుకోమన్నారు. పృధ్వీసింగ్‌ను మిలిటరీలోచేరి సైనికవిద్య నభ్యసించమన్నారు.

కాని పృధ్వీసింగ్‌కు నేర్చుకోవాలని కోర్కెవున్నా అంత ఓర్పు లేదు. అందుచే ఆ సలహాలను పాటించలేదు. భారత ప్రజలమధ్య నిలబడి తిరుగుబాటు చేయండని పిలుపుయిస్తేచాలు విప్లవం వస్తుందనే ఊహలో

వుండేవారు. అన్నిటికంటే విషాదకరమైనది ఎవరికీ నిర్మాణాత్మకమైన అనుభవం లేకపోవడమే. విప్లవంకావాలి. కాని ఎలావస్తుందో తెలియదు. స్పష్టమైన మార్గం గోచరంకాలేదు.

ఇంతలో గదర్‌పార్టీ భవిష్యత్ చరిత్రను మార్చుచేసిన ఒక ముఖ్యమైన సంఘటన జరిగింది.



## కొమగాటామారు ఉదంతం

1910 వ సంవత్సరానికి పూర్వం అనేక వేలమంది పంజాబీలు కెనడాకు వలసవెళ్ళారు. పొలాలలో, అరణ్యాలలో, ఫ్యాక్టరీలలో, గనులలో కార్మికులుగా పనిచేస్తున్నారు. ఆవిధంగా భారతీయులు కెనడా అభివృద్ధికి తమ రెక్కల కష్టముతో ఎంతో కృషిచేశారు. 1910 తరువాత కెనడా ప్రభుత్వం భారతీయులు వలస రాకూడదని నిషేధించింది. ప్రథమ దినాలలో భారతీయుల శ్రమవల్ల కెనడా ఎంతో లాభంపొందింది. కాని అలాగే భారతీయులను వలస రానిస్తే కెనడాలో భారతీయులు తెల్లవారికి పోటీ అవుతారనే దృష్టియే యీ నిషేధానికి కారణం.

ఇంతేగాదు. కెనడా ప్రభుత్వం ఆ దేశంలో అదివరకే నివాసము యేర్పరచుకొన్న భారతీయులను తరిమివేయడానికి ప్రయత్నించింది. ఈ విషయమై భారతీయుల తరపున అమెరికాలోను, కెనడాలోను, పంజాబులోను తీవ్రమైన ఆందోళన జరిగింది. అంతటితో కెనడా ప్రభుత్వం తన ప్రయత్నాలను విరమించ వలసి వచ్చింది.

ఈ సందర్భంలో భారతీయుల తరపున ఒక రాయబారవర్గం బ్రిటీషు పార్లమెంటువద్దకు వెళ్ళింది. కెనడాలో నివాసమేర్పరచుకొన్న భారతీయులకు వారికుటుంబాలను తెచ్చుకొనే అవకాశమివ్వాలని వాదించారు. కెనడా ప్రభుత్వం తమదేశంలో రేవుపట్టణమైన 'వాంకోరు' (Vancour) కు భారతదేశంనుంచి లిన్నగావచ్చే రహదారీ ఓడలేదనీ సాకుచెప్పింది. అందుచే వీలులేదని నిరాకరించింది.

భారతీయులు యింతటితో వదలిపెట్టలేదు. సింగపూరునుంచి బాబా గురుదత్తసింగ్ ఒక జపాను ఓడను అద్దెకు కుదిర్చాడు. ఈ ఓడ పేరే

'కొమగాటామారు ' అంటారు. దానిలో కలకత్తా రేవునుంచి కెనడాలో నివసించే భారతీయుల బంధువులు 400 మంది బయలుదేరారు.ఓడతిన్నగా కెనడాదేశంలోని రేవుపట్టణము అయిన 'వాంకోరు' కు చేరింది.

తీరా ఓడ రేవులోకి చేరాక, కెనడా ప్రభుత్వం ప్రయాణీకులు దిగ రాదని అభ్యంతరం చెప్పింది. తిరిగి వెళ్ళిపొమ్మన్నారు. ఓడలోకి సప్ల యిలు పంప నిరాకరించింది. పోలీసుదళాన్ని పంపి నాయకులను అరెస్టు చేయాలని ప్రయత్నించింది. కాని బాబాగురుదత్తసింగు ఏమాత్రం లొంగ లేదు. పోలీసులను తరిమివేశారు. కాని వీరు 400 మంది నిరాయుధులగు ప్రయాణీకులు. ఆహారం-నీరు కూడ సప్లయిగాకుండా కెనడా ప్రభుత్వం ఆపుజేసింది. వారిని మృత్యువు ఎదురుచూస్తోంది. ఎంతకాలం సాగుతుంది యీ పోరాటం?

భారతీయుల ఓడను తరిమివేయడానికి కెనడాప్రభుత్వం యుద్ధ నావను పంపడానికి కూడ సిద్ధమయింది. కెనడాలోని భారతీయులంతా యీ వార్త విని ఉద్రిక్తులయ్యారు. వేలకొలది తెల్లకార్మికులు సానుభూతి తెలిపి వారిని బలపరచారు. 5 వేల భారతకార్మికులు తమ ప్రాణాలను సైతం ఒడ్డటానికి నడుంబిగించారు. కెనడా ప్రభుత్వానికి అంతిమ సందేశం పంపారు. 'కొమగాటామారు' ను తరుమడానికి 'యుద్ధనావను పంపితే 'వాంకోరు' రేవుపట్టణాన్నంతటినీ భస్మీపటలం చేస్తామని బెదిరించారు.

చివరకు కెనడా ప్రభుత్వం దిగివచ్చింది. ఏదో ఒకవిధమైన రాజీ జరిగింది. ఈ విజయం భారతీయులలో స్వాతంత్ర్యజ్యోతిని వెలిగించింది. ప్రపంచానికంతకూ కెనడా ప్రభుత్వంయొక్క దుర్మార్గం వెల్లడయింది.

దీనిలో అన్నిటికంటే విచిత్రమైన విషయమొకటి వుంది. బ్రిటీషు ప్రభుత్వానికి, ఇండియా ప్రభుత్వానికి భారతీయుల ప్రయాణాన్ని గురించి రెండునెలలకు ముందుగానే తెలుసు. ఐనప్పటికీ ఎవరూ హెచ్చరించ నైనాలేదు. ఇంతఘర్షణ జరుగుతున్నా బ్రిటీషు ప్రభుత్వం నోరు మెదప లేదు. ఈ మూగతనం భారతీయుల హృదయాలను కలచివేసింది. దేశ మంతా ఉడికిపోయింది. కెనడా, అమెరికాలలో వున్న భారతీయులు తోక తొక్కిన త్రాచుల్లాగ ఎదురుదెబ్బ కొట్టాలని లేచారు.

'కొమగాటామారు' ఉదంతాన్ని తెలుపుతూ గదర్‌పత్రిక ప్రత్యేక సంచిక తెచ్చింది. దానిలో వ్యాసాలు పృథ్వీసింగును ఉద్రిక్తుణ్ణి చేశాయి. ఎలాగో ప్రింటింగుపూర్తిచేశాడు. దేశగౌరవాన్ని కాపాడటానికి ఏదోఒకటి

చేయాలి. ముందు మాతృదేశానికి వెళ్ళాలి అని నిశ్చయించుకున్నాడు. భారతీయులంతా 'శాక్రమెంట్స్' అనే పట్టణంలో సమావేశమయ్యారు. ఈ సమావేశంలో కార్యక్రమం నిర్ణయించుకోవాలి. అన్ని వైపులనుంచి భారతీయులు యీ సభలో పాల్గొనడానికి ఉత్సాహంతో వచ్చారు. అమెరికాలో రోజుకూలికి పనిచేస్తున్న భారతకార్మికులు తమదేశ స్వాతంత్ర్య పిలుపుకు కదలివచ్చారు. ఓరగాన్ రాష్ట్రంనుంచి 26 గురి దళం భాయి కేసరసింగ్ నాయకత్వాన వచ్చింది. అందరూ రానున్న సంగ్రామంలో తమ పాత్రను నిర్వహించడానికి తయారుగా వచ్చారు.

వేలకొలది ఒకచోట బహిరంగంగా సమావేశమయి బ్రిటీషు ప్రభుత్వానికి వ్యతిరేకంగా యుద్ధం ప్రకటించారు. భారత ప్రజకుకూడా అదే విధంగా తిరుగుబాటు చేయాలని పిలుపు యిచ్చారు. అలా చేస్తారని ఆశించారు. ప్రభుత్వం ప్రజల కివ్వాలసిన రక్షణ ఇవ్వడంలేదు. కాబట్టి ఎదురు తిరగాలన్నారు. స్వాతంత్ర్య సైనికులుగా 100 మంది ఎన్నుకోబడ్డారు. వారిలో పృథ్వీసింగ్ ఒకడు. వీరంతా 1914 ఆగష్టు 5 వ తేదీన ఓడ యెక్కి భారత దేశం పోవడానికి సిద్ధంగా వుండాలని పిలుపు వచ్చింది.

వేలకొలది అమెరికన్ ప్రజలు యీ తమాషా చూడటానికి వచ్చారు. కొందరు భారతీయుల స్వాతంత్ర్య తిరుగుబాటును సానుభూతితో చూచారు.

ఈ సభకు ఇండియాప్రభుత్వ సి. ఐ. డి. ముఠా ఏజెంట్లుకూడ హాజరయ్యారు. 'స్కాట్లండ్‌యార్డు' అనగా బ్రిటీషుప్రభుత్వ గూఢచారులు కూడవచ్చారు. వీరు సభలోజరిగిన ప్రతివిషయంమీద నోట్స్ తీసికొన్నారు. వారికి కావలసిన భోగట్టా అంతా తెలిసింది. దీని విషయమై పృథ్వీసింగ్ తన స్వీయచరిత్రలో యిలా వ్రాశాడు. "24 ఏండ్లు గడచిపోయాక ఇపుడు వెనక్కి తిరిగిచూస్తే ఆ సమయంలో ముఖ్యులలో ఎవరో ప్రభుత్వఏజెంట్లు వుండితీరాలనిపించుతుంది. రామచంద్ర తప్పకుండా ప్రభుత్వ ఏజెంటే. భగవాన్‌సింగ్ గ్రంథీ విషయం సందేహం. కాని వీరిద్దరు ముఖ్యులు, తెలిసినవారు. ఇతరులలో చాలమందికి చదువేరాదు, అమాయకులు. కొందరు చదువుకొన్నా అనుభవంలేనివారు. కాని ప్రభుత్వ ఏజెంట్లకు మాత్రం మా ప్రయాణం పర్యవసానం ఏమవుతుందో తెలిసేవుంటుంది."



# మాతృదేశానికి ప్రయాణం

1914 ఆగష్టు 5 వ తేది ఓడ సిద్ధంగావుంది. స్వాతంత్ర్య సైనికు లుగా ఎన్నుకోబడిన 100 మంది భారతీయులు ఓడ ఎక్కారు. ఏమి చేయాలో వారికే తెలియదు. సూచనలుకూడ ఇవ్వలేదు. అంతా తమంతట తామే రివాల్వార్లు, తూటాలు తెచ్చుకున్నారు. తరువాత - తెలిసింది. ఓడలోను, యీ దళంలోను కూడ ట్రెయినింగ్‌పొందిన సి. ఐ. డీలు ఉన్నారని.

ఓడ యెక్కాక యుద్ధకౌన్సిల్ ఎన్నుకోబడింది. ప్రతిరోజూ సమా వేశమయి అవసరమైన నిర్ణయాలు చేస్తుండేది. సైనికుల ఉత్సాహాన్ని కాపాడుతూండేది. యుద్ధకౌన్సిల్ భారతదేశంలో దిగాక తమ తమ ప్రాంతాలలో ఎలా పనిచేయాలో సలహాలిచ్చింది.

ఒకరోజున ఓడలోవున్న భారతీయులకు పృధ్వీసింగ్‌ను ఉపన్యాస మివ్వమన్నారు. పెద్దలముందు ఉపన్యాస మివ్వడానికి జంకుతూ ప్రారం భించాడు. చివరకు పృధ్వీసింగ్ తన ఉపన్యాసాన్ని యిలా ముగించాడు :

"మనం స్వాతంత్ర్య యుద్ధంలో పోరాడటానికి భారతదేశం పోతున్నాం. స్వాతంత్ర్యం వస్తుందో రాదో నాకు తెలియదు. కాని బానిస భారతదేశంలోవున్న ప్రజలకు మాతృదేశంకొరకు ఎలా మరణించాలో మాత్రం చూపించి తీరగలుగుతాము."

ఈ మాటలు ఆలోచించి చైతన్యంతో చెప్పినవి గాకపోవచ్చు. అయినా అవి అప్పటి పృధ్వీసింగ్ మనస్తత్వాన్ని తెలియజేస్తాయి. అమా యక హృదయంలో మాతృదేశం, ప్రజలయెడల వున్న సహజ ఉద్వే గాన్ని, ప్రేమను తెలియజేస్తాయి. ఓడలోవున్న పెద్దలంతా ఈ యువకుని మాటలకు హర్షించారు. గొప్ప వాడవుతాడని ఆశించారు.

## హోనోలూలూ

'శాన్‌ఫ్రాన్‌సిస్కో' రేవునుంచి ఓడ బయలుదేరగానే ప్రపంచ మంతా గప్పుమంది. భారత విప్లవకారులు బ్రిటీషు ప్రభుత్వంపై యుద్ధం

చేయడానికి వస్తున్నారనే వార్త వ్యాపించింది. వందలకొలది ప్రజలు 'హానోలూలూ' రేవులో వీరిని చూడటానికి వేచివున్నారు.

యూరపులో ఆ రోజుల్లో ప్రథమ ప్రపంచ మహాయుద్ధం తీవ్రంగా సాగుతూంది. రేవులో పత్రికలుకొని ప్రయాణీకులు చదువసాగారు. అపుడు కొందరు అమెరికన్లు ఓడపైకి వచ్చారు. వారిలో హవాయిదీవుల అధ్యక్షుడు కూడ వున్నాడట. వారు భారతీయులను ఉద్దేశించి యిలా అన్నారు; "భారతదేశానికి వెళ్ళండి; ఇంగ్లీషువాళ్ళను తరిమివేయండి. మేము అలాంటివార్తకు ఎదురుచూస్తూ వుంటాము. ప్రపంచ పత్రికలలో అలాంటివార్త ప్రకటించబడగానే మేము చదువుతాము. యువకుల్లారా! భలేపని చేశారు!! (Bavo Boys! Well done!!) అని ఆశీర్వదించుతాం" అన్నారు.

## యోకొహామా

10 రోజులు ప్రయాణంచేసి ఓడ జపానురేవుఅయిన 'యోకొహామా' చేరింది. అచట పృథ్వీసింగ్ హోటలులో ఆకస్మికంగా 'పరమానంద్ ఝూన్సీ' అనే మిత్రుని కలసికొన్నాడు. అతడు అమెరికా వెళ్ళాలని అచటికి వచ్చాడు. కాని చేతిలో డబ్బులేదు. పృథ్వీసింగ్ అతనిని యిదే ఓడలో భారతదేశానికి తిరిగిరమ్మని ఆహ్వానించాడు. ప్యాస్‌పోర్టు, అనుమతి లేకుండానే పరమానంద్ ఝూన్సీ సిద్ధమయ్యాడు. సి. ఐ. డీలు ఓడ అధికారులచే అభ్యంతరాలు చెప్పించారు. కాని చార్జీచెల్లించిన మీదట కెప్టెన్ ఓడలో ఎక్కడానికి అంగీకరించాడు. దించివేయడానికి వచ్చిన జపాన్ పోలీసులు చేసేదిలేక వెళ్ళిపోయారు.

త్రోవలో కోబె, నగాసకె రేవులను దర్శించారు. ఓడ క్రమంగా బ్రిటీషు కాలనీ అయిన హాంకాంగ్ దగ్గరకు వస్తూంది.

దేశభక్తి, స్వాతంత్ర్యకాంక్షలతోగూడి ఉద్రిక్తులైన మన సైనికులను సముద్రపుగాలి చల్లపరచింది. తామున్న పరిస్థితులను గురించి, హాంకాంగులో దిగగానే తమ్ము ఎదుర్కొనే సమస్యలను గురించి ఆలోచించసాగారు. అమెరికన్ ఓడ హాంకాంగ్‌వరకే వస్తుంది. రేవులో ఆగగానే అధికారులు సోదాచేస్తారు. ఆయుధాలుంటే అరెస్టుచేస్తారేమో! అందుచే వాటి నన్నిటిని సముద్రానికి అర్పించాలని నిర్ణయించబడింది.

స్వాతంత్ర్య సైనికులకు తమ ఆయుధాలను సముద్రానికి అర్పించడమంటే కళ్ళనీళ్ళ పర్యంతమయింది. డిసిప్లిన్‌తో ఆ నిర్ణయాన్ని అమలుజరిపారు.

## హాంకాంగ్‌లో

ఆ రోజులలో జర్మన్ జలాంతర్గామి అయిన 'ఎమ్డెన్' హిందూ మహాసముద్రంలో తిరుగుతోంది. దాని భీతివల్ల ప్రయాణీకుల ఓడలు తిరగడంలేదు. ఈ ఓడను చూడగానే హాంకాంగ్ రేవువద్ద ప్రజలు గుమికూడారు. రేవులో భారత సైనికులు కాపలావున్నారు. వారు ఓడకు సిగ్నల్సు యిచ్చారు. ఓడ పంజాబీ విప్లవకారులదనీ, భారత స్వాతంత్ర్యం కోసం వెడుతున్నామనీ ఓడలోనివారు సమాధానమిచ్చారు. కాపలాసైనికులు "సుస్వాగతం! మేమూ మీతోపాటే!" నన్నారు.

హాంకాంగ్‌లో అనుకొన్న సోదాలు వగైరా హడావుడీ ఏమీజరుగలేదు. బ్రిటీషు అధికారులు ఏమీ జోక్యం కలిగించుకోలేదు. అదివరకే వారికి సమాచారమంతా తెలుసుకాబట్టి ఏమీ పేచీపెట్టలేదు. భారత పోలీసులు, మిలిటరీ సానుభూతి తెలిపారు. గదర్‌పార్టీ సందేశం సైన్యానికి అందచేయడానికి పృథ్వీసింగ్ మిలిటరీ కేంద్రానికి వెళ్ళాడు. భారత సైన్యాలు భారత విప్లవం యెడల సంపూర్ణ సుముఖత చూపారు.

ఈవిధంగా అనుకూల పరిస్థితులున్నపుడు హాంకాంగ్‌ను భారతీయులు పట్టుకోడం సులభమే! కాని ప్రయోజనం ఏమీలేదు. అందుచే పట్టుకోడం ఆకర్షణీయంగా వున్నప్పటికీ అలా చేయరాదని నిర్ణయించుకున్నారు.

హాంకాంగులో రెండురోజులు గడిపాక 'టోసామారు' అనేజపాను ఓడలో భారతదేశానికి బయలుదేరారు. దారిలో 'ఎమ్డెన్' దెబ్బతీయవచ్చు. అయినా ప్రమాదాలను లెక్కచేయకుండా మాతృదేశంపైపు ప్రయాణం సాగించారు. దారిలో ఇతర ప్రయాణీకులు భయంతో దేవుని ప్రార్థించారు. మనవాళ్ళు బ్రిటీషువాళ్ళే జలాంతర్గామినిపంపి ఓడను ముంచివేస్తారేమో అని అనుమానించారు. కాని ఏలాంటి ప్రమాదం లేకుండా ఓడ సింగపూరు చేరింది.

సింగపూర్‌లోకూడ భారతసైన్యాలు విప్లవకారుల ఆశయాలపట్ల సానుభూతి తెలిపాయి, ఏమిచేయడానికైనా సంసిద్ధతను తెలిపాయి. కాని

మనవారి గమ్యస్థానం భారతదేశం. అందుచే సింగపూరులో ఆగదలచ లేదు. రంగూన్‌కు ఓడ బయలుదేరింది.

## రంగూన్‌లో

రంగూన్ రేవులో దిగి పట్టణంలోని భారతీయులకు గదర్‌పార్టీ సందేశాన్ని తెలియజేశారు. మిలిటరీ నివాసాలకువెళ్ళి భారత సైనికులతో మాట్లాడారు.

ఇచటనే ఒక విషాదకరమైన వార్తతెలిసింది. 'కొామగాటా మారు' లో భారతదేశానికివచ్చిన ప్రయాణీకులకు పట్టినగతి స్పష్టంగా తెలిసింది. వారు బెంగాల్‌లోని బడ్జ్-బడ్జ్ రేవులోదిగి, శాంతంగా పట్టణం లోకి బారులుతీరి నడుస్తున్నారు. ఆ నిరాయుధులపైన పోలీసులు తుపాకులు ప్రేల్చారు. అనేకులు యీ సంఘర్షణలో చనిపోయారు. మిగతావారు చెల్లాచెదరై పారిపోయారు.

ఈవార్త పృధ్వీసింగుకు యెంతో విచారం కలిగించింది. అలాంటి దుర్ఘటనే తమకు ప్రాప్తించుతుందని వీరుకూడ సిద్ధమయ్యారు.

హాంకాంగ్‌లో ఆయుధాలు పారవేశాక తోవలో కొందరు మరల సంపాదించారు. ప్రభుత్వ చర్యలవల్ల ఉద్రిక్తులైన వీరు ఏమైనా చేయ వచ్చును. అందుచే నాయకులు మరల ఆయుధాలను ఇచ్చివేయమని ఆజ్ఞా పించారు. ఏమంటే, వ్యక్తిగతహింసావాదం (టెర్రరిజం) వారిపద్ధతికాదు. అయినా కొందరు ఆంగ్లోఇండియన్లు వీరినలా పిలవడంలో అర్థంలేదు.

---

# మరల మాతృభూమిలో

ఓడ ఎట్టకేలకు హుగ్లీరేవుకు చేరింది. బ్రిటీషు పోలీసులు ప్రయాణీకులందరినీ సోదాచేశారు. జగత్‌రామ్‌కు ప్యాసుపోర్టులేదు. రానున్న ప్రమాదం తెలుసుకొని జాగ్రత్తపడ్డాడు. రంగూన్‌లో ఎక్కిన ప్రయాణీకులతో కలిసి తప్పించుకుపోయాడు. పండిట్ పరమానంద్‌కూడ వెళ్ళి పోయాడు.

కోపంతో కండ్లెర్రబడి వున్నవారిని, బలంగా వున్నవారిని పోలీసులు ఆపుజేశారు. స్పెషల్ రైలుబండి సిద్ధంచేశారు. వారినందరిని ఆ

బండిలో యెక్కించి మిలటరీ గౌరవాలతో పంజాబుకు ప్రయాణంకట్టారు. గూర్ఖా సిపాయిలు కాపలా; సి.ఐ.డి. లు పరివారం. నిప్పులు గ్రక్కు-కుంటూ రైలు బయలుదేరింది.

సి.ఐ.డి. లకు శాన్‌ఫ్రాన్‌సిస్కోనుంచి పృథ్వీసింగును గురించి పూర్తి రిపోర్టువచ్చింది. కొందరు తమపేరు, గ్రామంపేరు తప్పుగాచెప్పి ఆ స్టేషనురాగానే దిగిపోయారు. పృథ్వీసింగుకూడ అలాగే ప్రయత్నిం చాడు. కాని సి. ఐ. డి.లు అలా దిగనివ్వలేదు. ఇంతలో రావల్పిండి రైలుస్టేషను వచ్చింది. జోరున వాన కురువసాగింది. సి. ఐ డి. లు గొడుగులు వేసుకొన్నారు. ఈ సందడిలో తక్కిన ప్రజా సమూహంలో కలిసి తప్పించుకుపోయాడు. రైలుబండి వెళ్ళిపోయింది.

ఇదే పృథ్వీసింగుకు మొదటి అనుభవం. పోలీసులనుండి తప్పించుకున్నాడు. ఒక్కడు, యువకుడు, ఏమిచెయ్యాలి? అనే ప్రశ్న అతని కండ్లయెదుట తాండవమాడుతోంది.

పట్టణంలోకిపోయి దుస్తులు మార్చివేశాడు; మళ్ళీ రైలుబండి యెక్కి పంజాబుకు ముఖ్యపట్టణమైన లాహోరు వెళ్ళాడు. రాజపుత్ర పెద్దలను కలుసుకున్నాడు. వారు సాయం చేస్తామన్నారు. తరువాత పృథ్వీసింగు అంబాలాకు, స్వగ్రామమైన సారక్‌పూర్ వెళ్ళాడు. అచట అంతా పృథ్వీసింగుకొరకు పోలీసు కాపలావుంది. కాని వారిని సులభంగా తప్పించుకు తిరిగేవాడు.

## విప్లవకారుల సమావేశాలు

మొదటిసారి ఒకపట్టణ సమీపంలోవున్న పొలాలలో విప్లవకారులు సమావేశమయ్యారు. అందరూ తమ ప్రాంతాల రిపోర్టులు యిచ్చారు. ఎవరెవరు ఏమిచెయ్యాలో విధులు నిర్ణయించబడ్డాయి. శాన్‌ఫ్రాన్‌సిస్కో-లోని గదర్‌పార్టీ కేంద్రానికి రిపోర్టు తయారుచేసి పంపారు. తాముచేసిన పొరపాట్లు చేయవద్దని హెచ్చరికపంపారు. దీని ఫలితంగా తరువాత వచ్చినవారు భారతదేశానికి సురక్షితంగా చేరారు. మూడుగంటలలో సమావేశం పూర్తిచేసి ఎవరిపనికి వారు వెళ్ళిపోయారు.

రెండవసారి ఒకగ్రామ రైల్వేస్టేషనువద్ద సమావేశ మయ్యారు. రైలుబండికోసం వచ్చిన ప్రయాణికులవలె అభినయించారు. మీటింగులో అనేకులు తమ రిపోర్టులలో ఆర్థికంగా చాల బాధపడుతున్నట్లుగా తెలిపారు.

కొందరు దోపిడీచేసి డబ్బు సంపాదించాలని సూచించారు. వడ్డీవ్యాపారస్తులను గాని లేదా ప్రభుత్వ ట్రెజరీలనుగాని దోయాలన్నారు. ఈ విధానం పనికిరాదని నాయకులు నిరాకరించారు. బాబా నిధానసింగ్ అలాంటి తలపులు విప్లవపంథా కాదని ఆక్షేపించాడు.

ఈ సభకు బెంగాలునుంచి ఒక ప్రతినిధి హాజరయ్యాడు. బెంగాలు-పంజాబు విప్లవకారులమధ్య సంబంధాలు ఏర్పరచడానికి పృధ్వీసింగ్ నియమింపబడ్డాడు.

## అరెస్టుల ప్రారంభం

జగత్‌రామ్ సరిహద్దురాష్ట్రంలో పనిచేయడానికి నియమించబడ్డాడు. ఆకస్మికంగా ఒకరోజు పత్రికలలో అతడు అరెస్టు చేయబడినవార్త ప్రకటించబడింది.

ఒక గుర్రపుబండిలో విప్లవకారులు ప్రయాణం చేస్తున్నారు. ఆ బండిని పోలీసుదళం ఆపుజేసింది. విప్లవకారులు పోలీసుల మధ్య దెబ్బలాట ప్రారంభమయింది. రెండుపార్టీలూ ఆయుధాలు ఉపయోగించాయి. కాల్పుల లోకి దిగింది. ఒక పోలీసువాడు చచ్చాడు. పోలీసుదళం కాలికి బుద్ధి చెప్పింది. విప్లవకారులు పొదలచాటున దాగి ఆత్మరక్షణకు సిద్ధమయ్యారు. పారిపోయిన పోలీసులు రిజర్వు పోలీసుదళంతో వచ్చారు. తీవ్రమైన పోరాటం జరిగింది. చివరకు మందు అయిపోయినాక విప్లవకారులు చుట్టుముట్టటించబడి అరెస్టు అయ్యారు.

ఈ అరెస్టులు కొందరిలో నిరుత్సాహం కలిగించాయి. కొందరు మిత్రులు విప్లవోద్యమములోనుంచి మానుకోమని పృధ్వీసింగ్‌కు సలహా యిచ్చారు. అతడి హృదయావేదన వారికేమి తెలుస్తుంది? పృధ్వీసింగ్ వారి సలహాలను లక్ష్యపెట్టలేదు.

పృధ్వీసింగ్ రాజపుత్రులలోను, సైన్యంలోను రహస్యంగా పని చేస్తుండేవాడు. పంజాబు పోలీసులు అతనికోసం తీవ్రంగా వెదకసాగారు. మొక్కను మొదట్లోనే తుంచివేయాలని వారి ప్రయత్నం. ఎగ్జిక్యూటివ్ ఇంజినీరు సర్దార్ లేహనాసింగ్ మితవాది. - ప్రభుత్వ భక్తిపరాయణుడు. పృధ్వీసింగు ఇంకెంతమందినో కలిసికొన్నాడుగాని ఇతనివద్దకుమాత్రంవెళ్లలేదు. ఇతడు పృధ్వీసింగును చిన్నతనంలో చదువుకొనేటప్పుడుఎరుగును.

ఒకరోజు రాత్రి పృధ్వీసింగు 'అంబాలా' పట్టణంలోని రాజపుత్ర బోర్డింగుహౌసులోవున్నాడు. ఆ రోజునే లేహనాసింగుకూడ అచటక్యాంపు వేశాడు. విద్యార్థులు అమాయకంగా హుషారుకొద్దీ అతడుకూడ తమ వలెనే దేశభక్తిపరుడనుకొన్నారు. పృధ్వీసింగు అచటనే వున్నాడని తెలిపారు. ఆ పెద్దమనిషి పృధ్వీసింగును కలసికొని కులాసాగా కబుర్లు చెప్పాడు. తన గ్రామంవచ్చి రెండురోజులుండి పొమ్మని పృధ్వీసింగును ఆహ్వానించాడు. తరువాత తనకేదో తొందరపని వుందని వెళ్ళిపోయాడు. ఇతనికి విప్లవోద్యమంయెడల అభిమానంలేదని పృధ్వీసింగు యెరుగును. కాని ద్రోహం చేసేటంత నీచానికి పాల్పడతాడనిమాత్రం యెంచలేదు. వాడు తిన్నగా పోలీసు సూపరిండెంటు ఇంటికి వెళ్ళాడు. పృధ్వీసింగు విషయం రిపోర్టుచేశాడు.

మరునాడు ఉదయం విద్యార్థులందరూ స్కూలుకు వెళ్ళారు. పృధ్వీసింగ్ ఒకడే హాస్టలులోవున్నాడు. కోటువేసికొని యెచటికో వెళ్ళడానికి ప్రయాణమవుతున్నాడు. ఇంతలో యెవరో తలుపుకొట్టిన చప్పుడయింది. తలుపు తీయగానే వయస్సులోవున్న బలమైన ఒకసిక్కు పెద్ద మనిషి ప్రత్యక్షమయ్యాడు. 'సిక్కుల బోర్డింగుహౌస్ యెచటవుంద'ని ప్రశ్నించాడు. పృధ్వీసింగు 'ఇది రాజపుత్రుల బోర్డింగుహౌస్' అని సమాధానమిచ్చాడు. "కొంచం సిక్కు బోర్డింగుహౌస్ యెచట వుందో చూపుతారా?" అని అతడు అడిగాడు. పృధ్వీసింగు "కొంచెం ఆగండి. అలాగేచూపుతాను" అన్నాడు.

కాని ఆ పెద్దమనిషి యెందుచేతనో గాబరాపడసాగాడు. పృధ్వీసింగు ఆశ్చర్యపోయాడు. అతడు ఆకస్మికంగా రివాల్వరు పైకితీసి గురిచూపుతూ, "నావెంట రా! లేకపోతే చంపుతాను" అన్నాడు.

ఇంక ఆలోచించడానికి టైమ్‌లేదు. ఒక గంతులో వాడిమీదకు ఉరికి పృధ్వీసింగు రివాల్వరు పట్టుకున్నాడు. ఇద్దరిమధ్యా పెనుగులాట ప్రారంభమైంది. అతడెవడు? పోలీసైతే సాదాదుస్తులతో ఎందుకొచ్చాడు? అనే ప్రశ్నలు పృధ్వీసింగును బాధించసాగాయి. వాడు ట్రిగర్‌నొక్కి కాల్చుదామని ప్రయత్నించుచున్నాడు. పృధ్వీసింగు వాడిని యెత్తివేద్దామని ప్రయత్నించుతున్నాడు. ఇద్దరూ మాట్లాడకుండానే పెనుగులాడుతున్నారు. రివాల్వరు లాక్కొని, గదిలోపెట్టి తాళంవేసి వెళ్ళిపోదామని పృధ్వీసింగు ఊహ. చివరకు రివాల్వరు లాక్కున్నాడు. విసరిపారేశాడు. ఇంతలో

అతడు కత్తిదూసి పృధ్వీసింగుపై కలియబడ్డాడు. మెడమీద బలమైన గాయాలు తగిలాయి. దానితో పృధ్వీసింగు దెబ్బతిన్న పులివలె లేచాడు. వాడిని బాదాడు. మనిషిని యెత్తి గోడకేసికొట్టాడు. వాడు స్మృతితప్పి పడిపోయాడు. కాని గాయాలనుంచి పృధ్వీసింగుకు చాలారక్తంపోయింది. అందుచే తానుకూడా స్పృహలేకుండా పడిపోయాడు.

ఇదంతా జరిగేటప్పటికి 11–30 గంటలయింది. సాయంకాలం 5 గంటలవరకు పృధ్వీసింగుకు స్పృహరాలేదు. అపుడు ఆస్పత్రిలో యూరోపియన్ సర్జన్ గాయాలు కుడుతున్నాడు. మాదిగ చెప్పులు కుడుతున్నట్లుగావుంది ఆ డాక్టరు సర్జరీ. పైగా బూతులు తిడుతున్నాడు. పృధ్వీసింగు కోపంతో "డాక్టరువైతే నీపని చూసుకో! పిచ్చిగా వాగితే తన్నుతా" అని అరచాడు. మరల స్పృహ తప్పింది.

మళ్ళీ కళ్లుతెరచేటప్పటికి మంచంమీదవున్నాడు. నలుగురు పోలీసులు విచ్చుకత్తులతో పహరాయిస్తున్నారు. దూరంగా ఉద్యోగులు ఏదో మాటాడుకొంటున్నారు. ఒకడు పోలీసు సూపరింటెంటు. రెండోవాడు సిటీ మేజిస్ట్రేటు. పృధ్వీసింగుకు స్పృహరావడం చూచి దగ్గరకొచ్చారు. స్టేటుమెంటు (వాఙ్మూలం) యిమ్మని అడిగారు. క్రమంగా పృధ్వీసింగుకు అంతా జ్ఞప్తికి రాసాగింది. మేజిస్ట్రేటు చార్జీ చదివి వినిపించాడు. పృధ్వీసింగు తనను రివాల్వరుతో బెదిరించిన సిక్కు ఏమయ్యాడని ప్రశ్నించాడు. చావ సిద్ధంగావున్నాడని వాళ్లు సమాధానమిచ్చారు. ఇది పూర్తి అబద్ధం. వాడు క్షేమంగావున్నాడని తరువాత తెలిసింది. వాళ్లు క్రాసుపరీక్ష చేశారు గాని పృధ్వీసింగు వద్దనుంచి ఏమీ సమాచారం లాగలేకపోయారు.

పృధ్వీసింగుకు గాయాలు బాధపెట్టసాగాయి. ఈ సమయంలో చదువుకొనే రోజులలో ఎరిగిన యువకుడు ఒకడు పృధ్వీసింగుకు సలాములు పెట్టసాగాడు. వాడిని ఎందుకు దగ్గరకు రానిస్తున్నారో పృధ్వీసింగుకు బోధపడలేదు. వాడు ఆరోగ్యసంగతి అడిగి, నారింజకాయలు తెచ్చిపెడతానన్నాడు. పృధ్వీసింగు సానుభూతి తెలిపినందుకు వందనాలర్పించి వూరుకున్నాడు.

అంబాలా నగరంలో విపరీతమైన వదంతులు బయలుదేరాయి. విప్లవకారుడు అరెస్టుఅయ్యాడనీ, అతనిని విడిపించడానికి దాడివస్తుందనీ వదంతి వ్యాపించింది. ఈ భయంవల్ల పోలీసులు పృధ్వీసింగును ఆస్పత్రినుంచి జైలుకు మార్చివేశారు.

పృధ్వీసింగు తీవ్రమైన జ్వరంలోవున్నాడు. ఒకవైపున కటికినేల మీద పడక। మరొకవైపున గాయాలబాధ। బయటి వదంతులు జైలులోకి ప్రాకాయి. ఖైదీలకు తమకు విముక్తి వస్తుందనుకొంటున్న మాటలు విని పించుతున్నాయి. ఆరాత్రి తిండిపెట్టలేదు. నీళ్ళు యివ్వలేదు. పృధ్వీసింగ్ స్థితి ఎలావుంటుందో యింకేమి వర్ణించగలం?

మరునాడు ఉదయం అధికారులు పృధ్వీసింగును చూడటానికి వచ్చారు. అసిస్టెంటు సర్జన్ 'రెండు మెడనరాలు తెగాక బ్రతకడమంటే అదృష్టమే' నని రిమార్కు చేశాడు.

విచారణలో వున్నవారికి (undertrial-మద్దాయి) జైలురూల్సు ప్రకారం బయటనుంచి భోజనం పంపించవచ్చును. కాని జైలుఅధికారులు పృధ్వీసింగుకు అలాంటి అవకాశం యివ్వలేదు. జైలుతిండే పెట్టారు. బంధువులకు అతనినిచూసే అవకాశం యివ్వలేదు. అమెరికాలోవుండగా పృధ్వీసింగు భారతదేశ జైళ్ళసంగతి విన్నాడు. ఇపుడు ప్రత్యక్షంగా అనుభవించాడు. జైలు అధికారుల కఠినత్వం పృధ్వీసింగు మరింత గట్టి పడటానికే తోడ్పడింది. జైలు నిర్బంధాలు అనేకమందిని యీ విధంగా యావజ్జీవం విప్లవకారులుగా వుండేటట్లు చేశాయా అనిపించుతుంది.

---

# మొదటి కేసు

ప్రపంచ విప్లవోద్యమ చరిత్రను తెలిసికొని దానినుంచి అనుభవాలను గడించాలి; ఎలువు-సుళువులను గ్రహించాలి; లేనిచో విప్లవకారి తనకర్తవ్యాన్ని సరిగా నెరవేర్చలేడు. అనుపజ్ఞులయిన ఉద్యోగస్థులు ఎన్నోవలలు పన్నుతారు. వారి మోసాలలో పడకుండా వుండటానికి, వారితో జయప్రదంగా పెనుగులాడటానికి విప్లవకారులకు తెలివితేటలుండాలి, లేనిచో ఉద్యమానికి సేవకంటే నష్టమే ఎక్కువ చేస్తారు.

పృధ్వీసింగును జైలులోకి మార్చి రెండురోజులయింది. ఉదయమే అధికారులు ఒకడిని యీడ్చుకువచ్చి పృధ్వీసింగు వున్నదానికి పక్కకొట్లో పడవేశారు. సూపరిండెంటు వచ్చి ఆ కొట్టుముందు నిలబడ్డాడు; బూతులు తిట్టసాగాడు. "నిజం చెప్పు. లేనిచో కాల్చిచంపుతాం" అనీ, పృధ్వీ

సింగుతో కలిసి కేసుపెడతామనీ సూపరింటెంటు బెదిరించుతున్నాడు. వాడు ఏడుస్తూ తానేమీ ఎరుగనని బ్రతిమాలుకొంటున్నాడు.

అది చలికాలం. రోజూ కొట్టుముందు కొన్ని నిమిషాలపాటు ఎండలో తిరగడానికి జైలరు పృధ్వీసింగుకు అనుమతి యిచ్చాడు. అలా తిరుగుతూవుండగా ప్రక్క కొట్టులో మూలుగుతున్నవాడు కన్పించాడు. అతడు ఆస్పత్రిలో పృధ్వీసింగుకు నారింజకాయలు యిచ్చినవాడే. పేరు ఆత్మారామ్. బిక్కమొగం వేసుకొని వాడు పృధ్వీసింగుతో "ధర్మమని మీకు సాయంచేశాను. నా ఖర్మం యిలా జరిగింది" అని వాపోయాడు. ఈ గొడవంతా పృధ్వీసింగుకు స్పష్టంగా బోధపడలేదు. ఏమిచెప్పాలో తోచలా! "సోదరా! మనం అపాయకులం — భగవంతుడే మనలను రక్షించుతాడు." అని తెలివిగా తప్పుకున్నాడు.

ఈ నాటకం రోజూ జరిగేది. క్రమంగా వాడు ధైర్యంవహించి విప్లవోద్యమం గురించి మాట్లాడసాగాడు. అప్పటికి పృధ్వీసింగు వాడి దగా తెలిసికోలేదు. తరువాత వాడు తన్ను కొట్టినందుకు సూపరింటెంటుపై కోపం వెల్లడించసాగాడు; కక్ష తీర్చుకుంటానన్నాడు; పండిత్ జగత్ రామ్‌ను తాను చూచానని చెప్పాడు. ఎపుడు చూచావని పృధ్వీసింగ్ అడిగిన ప్రశ్నకు సమాధానంగా నాలుగు నెలలయిందన్నాడు. దీనితో వాడి బండారం బయటపడిపోయింది. నాలుగు నెలలనాటికి పండిత జగత్‌రామ్ భారతదేశంలోనే లేడు. వీడెలా చూచాడు?

వాడు తప్పకుండా పోలీసులచే పంపబడిన ద్రోహి అని తెలిసిపోయింది. పృధ్వీసింగుకు వాడంటే అసహ్యం వేసింది. కాని కోపం చంపుకొని పృధ్వీసింగ్ ఎప్పటివలెనే ప్రవర్తించసాగాడు. ఆ పోలీసు ఏజెంటు తనకు బాంబులు చేసేవిధం చెప్పమని పృధ్వీసింగును పీడించసాగాడు. పృధ్వీసింగు కాగితం - పెన్సలు తెమ్మకోమన్నాడు. జైలులో ఇవి దొరకడం ఎంతోకష్టం. కాని వాడు మరునాడే కాగితం - పెన్సలుతో ప్రత్యక్షమయ్యాడు. పృధ్వీసింగు వాడికి కొన్ని మందులపేర్లు చెప్పాడు. అవన్నీ మూకుట్లోవేసి పొయిమీద బాగా వేయించమన్నాడు. ఆ ద్రోహి తెల్లపోయాడు. "బాబో నేను చావనా" అన్నాడు. పృధ్వీసింగు ఓరి పందీ! నీకదే తగినశాస్తి అన్నాడు. తరువాత వాడు తన ప్రయత్నమంతా విఫలమయిందనిచెప్పాడు. పాపం! కొన్నిరోజులు జైలు అనుభవించినా ఆ ద్రోహికి ప్రమోషన్ రాలా!

## కేసు విచారణ

పోలీసులు కోహన్‌సింగు అను బోర్డింగ్‌స్కూలు విద్యార్థినికూడ లాక్కొచ్చి యీ కేసులో అనవసరంగా కుక్కారు. 15 రోజులయింది, గాయాలు నయమవుతున్నాయి. జైలులోనే ఫస్టుక్లాసు మేజిస్ట్రేటు విచారణ ప్రారంభించాడు.

పృధ్వీసింగుతో దెబ్బలాడినవాడు సిక్కు సబ్‌యిన్‌స్పెక్టరని విచారణ సమయంలో తెలిసింది. సూపరిండెంటు వాడిని ఏదో బాతాఖానీ వేసుకొని పృధ్వీసింగు ఎటూ పోకుండా చూడమని పంపాడట. వాడు భయపడి అంతా రసాభాసం చేశాడు. తరువాత పోలీసు లారీతోవచ్చి సూపరిండెంటు అరెస్టుచేశాడు. పృధ్వీసింగుపై ఖూనీచేయడానికి ప్రయత్నించాడని (Attempt of Murder) పోలీసులు కేసుపెట్టారు. విద్యార్థిపై సబ్‌యిన్‌స్పెక్టరు పర్సు (డబ్బుసంచి) దొంగిలించాడని కేసు పెట్టాడు. ఇంతకంటే అసంబద్ధమైన కేసు వుండబోదు అని వేరే చెప్పనక్కరలేదు.

మేజిస్ట్రేటు విచారణలో లాయర్లు డిఫెన్సు (ప్రతివాదం) పెట్టలేదు. కేసు సెషన్సుకోర్టుకు పంపబడింది.

కుమారుని అరెస్టుసంగతి విని తండ్రి షాదీరామ్ బర్మానుంచి వచ్చాడు. ఇంటర్వ్యూకు అనుమతి అడిగి కుమారుని కలసికొన్నాడు. ప్రక్కనే పోలీసుఉద్యోగి నిలబడివున్నాడు. వారికి తెలియకుండా వుంటానికి తండ్రీకుమారులు బర్మాభాషలో మాట్లాడుకొన్నారు. తండ్రి కేసులో వాదించడానికి మంచి లాయరును పెడతానన్నాడు. పృధ్వీసింగు తండ్రితో ఒక కుమారుని దేశానికి అర్పించివేశానని భావించమన్నాడు; ఎట్టి ఆశ పెట్టుకోవద్దన్నాడు; తన్ను ఆశీర్వదించమని నమస్కారం చేశాడు.

జిల్లాకోర్టులో మరల విచారణ జరిగింది. పోలీసులు బోర్డింగు స్కూలు అధికారులను, విద్యార్థులను అబద్ధపు సాక్ష్యాలు చెప్పమని బాధించారు. కాని వారు లొంగలేదు. సెషన్సుకోర్టులో ముగ్గురు అసెసర్లు వున్నారు. ఇద్దరు వర్తకులు. ఒకడు మహమ్మదీయుడు. విచారణ పూర్తి అయ్యాక జడ్జీ అసెసర్ల అభిప్రాయం అడిగాడు. వాళ్ళు గదిలోకి ఆలోచించుకోడానికి వెళ్ళివచ్చారు. ముగ్గురూ ముద్దాయిలు నిర్దోషులని చెప్పారు. కాని జడ్జీ అలా వీలులేదు; కారణాలేమిటో చెప్పమన్నాడు.

వారు పోలీసులు తమ ముందుండగా మాటాడడానికే వణికి పోయారు. జడ్జీ పోలీసులను బయటికిపంపివేశాడు. ముస్లిం అసెసరు ఇలా చెప్పాడు "ఛార్జీలు రుజువుకాలేదు ముద్దాయిలు నిర్దోషులు. అందుచే వదలాలి" అన్నాడు. తరువాత ఒక బనియా అసెసరు ఇలాచెప్పాడు. "మేము రెండు అగ్నులమధ్య వున్నాం. ఒకవైపు నరకబాధ - రెండోవైపు పోలీసులబాధ. నిర్దోషి అయిన ముద్దాయికి వ్యతిరేకంగా చెబితే చచ్చాక నరకబాధతప్పదు. పోలీసులకు వ్యతిరేకంగా చెబితే పోలీసులు బ్రతికుండగానే బాధించుతారు. పోలీసుబాధ పడటానికే సిద్ధమయ్యాను" అని వాపోయాడు. మూడో అసెసరుకూడ అలాగే చెప్పాడు.

గవర్నమెంటు ప్రాసిక్యూటరు జడ్జీపై ఒత్తిడి తెచ్చాడు. మరుసటి వాయిదాలో జడ్జిమెంటు చెప్పబడింది పృధ్వీసింగుకు 10 సంవత్సరాలు కఠినశిక్ష, కోహన్‌సింగుకు 15 నెలలు కఠినశిక్ష వేయబడింది.

ఈసారి నేరస్థుడుగా పృధ్వీసింగును సెంట్రల్ జైలుకు పంపారు. జైలురూల్సుప్రకారం కొత్త జైలుదుస్తులు యివ్వాలి. ఇతరులు విడిచి పోయిన మురికి బట్టలిచ్చారు. అవి తడిపి ధరించాడు. కఠిననరకం. జొన్నలు విసరడం యిచ్చారు. రోజుకు 40 పౌనులు జొన్నలు విసరాలి. పృధ్వీసింగు తనవంతు విసరివేసి నిదురపోయాడు. వార్డరు చూచి కొత్తగా వచ్చిన ఖైదీ చేయగలిగాడని నమ్మలేదు. మరునాడు పృధ్వీసింగుకు కొత్త తిరుగలి యిచ్చారు. మొదటి తిరుగలి నిలుచుని తిప్పవచ్చు. అందుచే వీలుగా వుంటుంది. కొత్త తిరుగలి కూర్చుని తిప్పాలి. ఇది అనవసరంగా పృధ్వీసింగును బాధించడానికి ఇచ్చినపనే. అంతకంటే దానికి అర్థంలేదు; అంతకంటే మూర్ఖత్వం వుండబోదు.

బ్రిటీషు ప్రభుత్వం బానిస భారతదేశంలో అనుసరించే పద్ధతే చెడ్డది. తమ అంతరాత్మనే అమ్ముకొన్న హృదయంలేని ఉద్యోగులు దానిని మరింత దుర్భరంచేస్తున్నారు. పృధ్వీసింగును అధికారులు ఉరిశిక్ష వేసిన ఖైదీలను వుంచే కొట్లలోపెట్టారు. ఇతర ఖైదీలనుకూడ కలసికోనిచ్చేవారు కాదు.

•••○○○•••

# చరిత్రాత్మకమైన లాహోరు కుట్రకేసు

కొందరు అరెస్టు అయినంతమాత్రాన ఉద్యమం వెనుకబడదు. ఇంకా అనేకమందిని గదర్‌పార్టీ అమెరికానుంచి భారతదేశానికి పంపుతోంది. వారు వచ్చి తమతమ ప్రాంతాలలో పనిచేస్తున్నారు. వారంతా దాదాపు గ్రామాలలోని రైతుకుటుంబాలకు చెందినవారే. బంధువులద్వారా వారికి సైన్యంలో పనిచేసేవారితో సంబంధాలు వున్నాయి. భారతసైన్యంతో సంబంధం పెట్టుకొని సైనికులలో దేశభక్తి ప్రచారం చేయడానికి యివి ఉపయోగపడ్డాయి. భారతసైన్యాలు స్వాతంత్ర్య ఉద్యమానికి సాయంచేయడానికి సంసిద్ధతను తెలిపాయి. మొదటి ప్రపంచయుద్ధం తీవ్రంగా సాగుతున్న రోజులవి. ఇతరదేశాలకు వెళ్ళడానికి భారతసైనికులకు యిష్టం లేదు. ఇండియాలో సైన్యం పదివేలే. భారత స్వాతంత్ర్య సంపాదన సులభంగానే కన్పించింది.

కర్తార్‌సింగు, పింగళే అనే దేశభక్తులు సైన్యంలో ప్రచారం గావించారు. తిరుగుబాటుకు రోజు నిర్ణయించితేచాలు ! అంతా దానంతటదే జరిగిపోతుందనుకొన్నారు.

ప్రభుత్వానికి తన సైన్యంలోవున్న బలహీనత తెలుసును. అది హెచ్చుగా సి. ఐ. డి. డిపార్టుమెంటు (గూఢచారుల) పైన. దేశద్రోహుల పైన ఆధారపడివుంది. కిర్‌పాల్‌సింగు అను ద్రోహిని బుట్టలోవేసికొంది. వాడు ఉద్యమంలోని ముఖ్యులందరి విశ్వాసాన్ని సంపాదించాడు. నిర్ణయించబడిన ప్లాను, తేదీ తెలుసుకున్నాడు. ప్రభుత్వానికి అందజేశాడు. అందుచేత ప్రభుత్వం 24 గంటలకు ముందుగానే సిద్ధంగావుంది. వరుసబెట్టి అందరినీ అరెస్టుచేసింది. సైనికులు అనేకులు కోర్టుమార్షల్ చేయబడ్డారు. కాల్చివేయబడ్డారు. కాని ఆవార్తే ప్రపంచానికి తెలుపబడలేదు.

జైలులోవున్న పృధ్వీసింగుకు యీవిషయం యేమీ తెలియదు. సూపరింటెంటు వచ్చి "మీవాళ్ళనందరినీ పట్టుకున్నాం, రక్షించుకునే మార్గం ఆలోచించుకో" మన్నాడు.

పృధ్వీసింగు "నాకు 10 యేండ్లు శిక్ష విధించారు. రోజు 40 పౌన్లు జొన్నపిండి విసరుతున్నాను. ఇంకేంచేస్తారు ?" అన్నాడు. బాగా ఆలో

చించుకోమని సూపరిండెంటు వెళ్ళిపోయాడు. మళ్ళీ రాత్రి వచ్చాడు. "నీ బాగుకోసమే చెపుతున్నాం, రాజపుత్రుడవు, సైన్యంలో చేరవచ్చు!" అన్నాడు సూపరిండెంటు.

"మంచిపనే! సైన్యంలోకి పంపండి, నా పౌరుషం చూపుతాను!" అని పృధ్వీసింగు సమాధానం. అంతేగాని సూపరిండెంటు పృధ్వీసింగు వద్దనుండి ఏమీ రహస్యాలు రాబట్టలేకపోయాడు. 'నీ సంగతి ఇంతేలే?' అని విసుక్కుంటూ వెళ్ళిపోయాడు.

లాహోరులో 85 మందిపై ఒక కుట్రకేసును ప్రభుత్వం పెట్టింది. 65 గురు పట్టుబడ్డారు. అందులో 8 మంది అప్రూవర్లు (ద్రోహులు) గా మారారు. వీళ్లు పృధ్వీసింగు చరిత్రంతా చెప్పారు. పృధ్వీసంగుకు యిది యేమీ తెలియదు మళ్ళీ సి. ఐ. డీ. లు వచ్చి ప్రశ్నలతో పీడించసాగారు. వీళ్ళకు ఖైదీల ప్రాణాలపై సర్వాధికారాలు వుంటాయి. ఎన్నో ఆశలు గొల్పుతారు. వీరి మోసాలనుండి తప్పించుకోడం విప్లవకారులకు నిజంగా ఒక పరీక్ష. పృధ్వీసింగు మొదట యేదో కల్పిత కధచెప్పి తప్పించుకో జూచాడు. కాని లాభం లేకపోయింది. వాళ్ళు తమకు నిజం యిదివరకే తెలుసునని రుజువుచేశారు. ఇంక వాళ్ళతో వాదించి, తప్పుడుమార్గాన పెట్టడం సాధ్యంకాదని పృధ్వీసింగు తెలిసికొన్నాడు. ప్రతి ప్రశ్నకు 'నాకు తెలియదు; ఎరుగను; మరచిపోయాను' అని సమాధానం ఇచ్చాడు. వాళ్లు ఇంక లాభంలేదని విరమించుకున్నారు.

లాహోరు కుట్రకేసులో పృధ్వీసింగునుకూడ చేర్చారు. తండ్రి షాదీరామ్ కుమారుని చూడటానికి జైలుకువచ్చాడు. అదివరకు షాదీరాంకు 50 ఏండ్లువున్నా జుట్టు ఒక వెంట్రుకైనా నెరియలేదు. కాని గత కొన్ని నెలలలోనే జుట్టంతా నెరసిపోయింది. మనిషి వంగబడిపోయాడు. కొడుకు చిక్కులలో బడిపోయాడనే చింత షాదీరాంను క్రుంగదీసింది. కాని కొడుకుతో మాట్లాడునపుడు గంభీరంగానే వూరుకొన్నాడు.

మర్నాడు పృధ్వీసింగును లాహోరు జైలుకు మార్చారు. అచట దోకులు - విరేచనాలు ప్రారంభమై జబ్బుచేసింది. జైలు అధికారులు యెట్టి వైద్యసహాయమూ చేయలేదు. మట్టితట్టలు మోయించారు. ఇతర ఖైదీలతో కలిసే యీ పని ఇచ్చినందుకు జైలరు క్రింది అధికారుల్ని తిట్టాడు. 14 వ వార్డులోనికి మార్చాడు. అచట ఖూనీ కొట్లలోని స్నేహి

తులకు నీళ్ళు అందించే పనియిచ్చారు. వారిలో పోలీసులతో యుద్ధంచేసిన మిత్రులు వున్నారు.

రెండోరోజున బాబా సోహన్‌సింగు అచటికి వచ్చాడు. మిత్రులందరను ఒక చోటకు చేర్చడంచూచి స్వాతంత్ర్య యజ్ఞానికి సమిధలను పోగుచేస్తున్నారన్నాడు. గదులు అన్నీ స్వాతంత్ర్య యాత్రీకులతో నిండి పోయాయి. ఒకరినొకరు కౌగలించుకొన్నారు. అంతా ఒకచోట చేరినందుకు పరమానందభరితు లయ్యారు. శిక్షింపబడిన పండిత జగత్‌రామ్‌ను కూడ అచటికి తెచ్చారు. వారిలో పృధ్వీసింగు, జగత్‌రామ్ వీరిద్దరే శిక్షితులు. తక్కినవారంతా విచారణలోవున్న ముద్దాయిలు. రెండు రోజుల తరువాత శిక్షితులకుకూడ జైలు దుస్తులు తీసివేసి సామాన్యదుస్తులిచ్చారు.

## వి చా ర ణ

1857 తరువాత ఇదే పెద్ద రాజకీయ కేసు. స్వాతంత్రోద్యమ చరిత్రలో ఇది ప్రధమ లాహోరు కుట్రకేసుగా ప్రసిద్ధిచెందింది. జైలులో ఒకవార్డు ఖాళీచేసి ప్రత్యేక కోర్టుపెట్టారు. ముగ్గురు హైకోర్టు జడ్జీలు - ఇద్దరు యూరోపియన్లు, ఒకరు భారతీయుడు - ప్రత్యేకంగా నియమించబడ్డారు. ప్రభుత్వం తరపున 'పెట్మన్' అనే గొప్పలాయరు, ప్రాసిక్యూటరు, సి. ఐ. డీ. ల మద్దతుతో కేసు నడిపారు.

ఈ కేసులో భారతస్వాతంత్రోద్యమం తరపున ప్రతినిధులుగా 65 గురు ముద్దాయిలు బోనులో నిలబడ్డారు. ముద్దాయిల తరపున వాదించడానికి 7 గురు లాయర్లను ప్రభుత్వం నియమించింది. వీరికి ఏమీ అనుభవం లేదు. భయస్తులు. ప్రాసిక్యూటరు గట్టిగా దబాయించితే ఝడిసేవారు. స్వంత ప్లీడర్లను పెట్టుకోడానికి ముద్దాయిలకు అవకాశం యివ్వలేదు.

1915 మార్చినెలలో విచారణ ప్రారంభమయింది. క్రిమినల్ ప్రొసీజరు కోడ్‌లోని సెక్షన్లు అన్నీ ప్రయోగించబడ్డాయి. చక్రవర్తికి వ్యతిరేకంగా యుద్ధంచేయడానికి కుట్రచేశారని నేరం ఆరోపించబడింది. కుట్ర అనడమే అబద్ధం. అంతా బహిరంగంగానే చేశారు. తమ సోదరదేశీయులైన కొమాగాటామారు ప్రయాణీకులకు జరిగిన అక్రమాలకు ప్రతికక్షగా తిరుగుబాటును బోధించారు.

అసలు విచారణే పెద్దఫార్సు. ఆ రోజులలో బ్రిటీషు కోర్టులలో కించెత్తైనా న్యాయం జరుగుతుందని వారాశించలేదు. చేసినదానికి అనుభ

వించాలి! మరోమార్గంలేదు. అందుచే ముద్దాయిలు నిర్లక్ష్యంగా వుండే వారు. జడ్జీలు అనేకసార్లు ఆర్డరు (శాంతి) కోసం గంట మోగించవలసె వచ్చేది. అదీ లక్ష్యం చేయకపోతే జడ్జీలకు కోపంవచ్చేది. అదిచూచి ముద్దాయిలు మరింత నవ్వేవారు. తమ తరపున వాదించడానికి పెట్టిన లాయర్లను ముద్దాయిలు నమ్మేవారు కాదు. ఆ ప్లీడర్లు కూడ కేసును గురించి తమకేమీ పట్టనట్టే వుండేవారు. ఎప్పుడైనా ఖర్మంచాలక పోలీసు లకు యిబ్బంది కలిగించే సరియైన ప్రశ్న అడిగితే అధికారులపద్దనుంచి తిట్లువచ్చేవి. డిఫెన్సు సాక్షులపేర్లు ముందుతెలిపితే పోలీసులు వారిని బెదిరించుతారని ముద్దాయిలు ముందుగా చెప్పనిరాకరించారు.

ప్రభుత్వం తరపున 8 గురు అప్రూవర్లు సాక్ష్యమిచ్చారు. 2 నెలలు తరువాత 9 వ వాడు అప్రూవరుగా మారాడు.

కోర్టులో ముద్దాయిలుగా హాజరయిన 65 లోనూ 12 మందికి మాత్రం యింగ్లీషు తెలుసు. ముద్దాయిలలో కొంతమందికి గదర్‌పార్టీతో ఎట్టిసంబంధమూలేదు. కొందరు సానుభూతిపరులు మాత్రమే. హెచ్చు మంది ఉద్రేకంతో వచ్చారు అంతే. లైఫ్ మెంబర్లు అనగా జీవితమంతా పనిజేసేవారు 15 మంది మాత్రమున్నారు.

ముద్దాయిలు తమ డిఫెన్సువాదన ఎలా వుండాలసిందీ నిర్ణయించు కొన్నారు. 7 గురు లైఫ్ మెంబర్లు కేసుకంతకూ బాధ్యత వహించాలను కొన్నారు. భారత విప్లవానికి ప్రతినిధులుగా నిలబడాలనుకొన్నారు. అందులో పృధ్వీసింగు ఒకడు. చిన్నవాడైనా తనకుకూడా ముఖ్యులతో పాటు స్థానం యివ్వబడినందుకు పృధ్వీసింగు ఎంతో గర్వపడ్డాడు. కొమ గాటామారు దురంతాన్ని గురించి విచారణ సమయంలో బట్టబయలు చేయాలని నిర్ణయించుకొన్నారు.

కాని ఆ రోజులలో బట్టబయలు చేయగలమనుకోవడం వృధా ఆశ మాత్రమే. ముద్దాయిల స్టేటుమెంటులు బయటిప్రపంచానికి చేరనేలేదు. పోలీసులు ప్రజలను కోర్టుకు రానివ్వలేదు. దగ్గరబంధువులను కూడ రానివ్వలేదు. కోర్టులో యిచ్చిన స్టేటుమెంట్లు పత్రికలకు చేరలేదు. ప్రభుత్వం యిచ్చిన వార్తలను మాత్రమే పత్రికలు ప్రకటించాయి. ఉరి కంబాలెక్కిన కామ్రేడ్సును అనుసరించుతున్నామనీ; పాడు కుళ్లు జైలు జీవితం తప్పిపోతుందనీ: అదొకటే వారికి సంతృప్తి.

పృధ్వీసింగు తన స్టేటుమెంటులో యిలా చెప్పాడు:

"నేను, పండిత్ జగత్‌రామ్ అమెరికాలో వుండగా గదర్ ఆశ్రమంలో పనిచేశాము. భారతదేశానికి కలిసేవచ్చాము. పోలీసునిఘా తప్పించుకు పనిచేయగలిగాము.

"అమెరికాలో వుండగా మిత్రులు మేము బహుజాగ్రత్తగా వుండాలన్నారు. ఇండియాలో సి. ఐ. డీలు చాల తెలివిగలవారన్నారు. అవులించితే ప్రేగులు లెక్కించుతారన్నారు. కాని వీళ్ళ తెలివితేటలు చూడండి! మమ్మ పట్టుకోలేక తమ ప్రతిష్ఠ కాపాడుకోడానికి ఏమీ ఎరుగనివారిని పట్టుకొచ్చి ప్రమాదకరమైనవారుగా కేసుపెట్టారు."

ఈ మాటలకు అంతా నవ్వారు. చప్పట్లుకొట్టారు. జడ్జి 'ఆర్డర్' అని అరుస్తూ బెల్‌కొట్టాడు.

అమరసింగు అను రాజపుత్రుడు తరువాత స్టేటుమెంటు యిచ్చాడు. ఇతని బంధువులద్వారా ఒత్తిడితెచ్చి పోలీసులు తిప్పివేశారు. గదర్ పార్టీలో పనిచేసి ద్రోహిగా మారింది వీడొకడే. పోలీసులు తమ రికార్డులో పృథ్వీసింగును సిఖ్ఖు అని రికార్డుచేశారు. రాజపుత్రులలో విప్లవకారులు లేరని రుజువుచెయ్యాలని వారిప్రయత్నం. ద్రోహిగామారిన అమర్‌సింగును మాత్రం రాజపుత్రుడని రికార్డుచేశారు. నిజంగా ఉద్యోగులది వింతప్రకృతి.

కేదారనాథ సైగల్ హాస్యంగా మాట్లాడేవాడు. ఆయనను జడ్జీ ప్రశ్నలడిగాడు. వృత్తిఏమిటంటే పబ్లిషర్ అని సమాధానమిచ్చాడు. ప్రెస్ పేరేమిటి? అనే ప్రశ్నకు 'ఖబర్‌దార్' అని జవాబిచ్చాడు. జడ్జికి అర్థంకాలేదు. మళ్ళీ అదేప్రశ్న అడిగాడు. మరల అదేసమాధానం. అంతా ఫక్కున నవ్వారు. అప్పటికీ జడ్జికి అర్థంకాలేదు. ప్లీడరు ప్రెస్సుపేరే ఖబర్‌దార్ అని జడ్జీకి తెలియజెప్పాడు.

కర్తార్‌సింగు దొమ్మీలో పాల్గొన్నాడు. ఆ గ్రూపుకు నాయకుడే అతను. ఒక ఖూనీ జరిగింది. ఒక దేశీయుని చంపిన బాధ్యత తనదేననీ, తప్పించుకో తలచలేదని ధీరత్వంతో చెప్పాడు. జడ్జీలు "ధైర్యవంతులలోకల్లా ధైర్యవంతుని" (Bravest of the Brave) చూచి నివ్వెరపోయారు.

జడ్జిమెంటురోజున ఆరుగురుచొప్పున విడివిడిగా ముద్దాయిలను కోర్టుకు తీసికెళ్ళారు. పృథ్వీసింగుదళంలో అతనికొక్కడికే ఉరిశిక్ష చెప్పబడింది. మొత్తం 25 మందికి మరణశిక్ష విధించారు. 20 మందికి యావజ్జీవ ద్వీపాంతరవాస శిక్షవేశారు. 20 మందికి వివిధ శిక్షలు. 5 గురిని

మాత్రం వదలివేశారు. కాని వారినికూడ కోర్టుబయటి పోలీసులు మరల అరెస్టుచేశారు.

ఉరిశిక్ష వేసినవారిలో ముగ్గురికిమాత్రం ఖూనీకేసుతో సంబంధ ముంది. 15 మంది ఓడ దిగకుండానే అరెస్టయినవారున్నారు. నిజంగా వారు చేసిన నేరం ఏమీలేదు. వారు దేశాన్ని ప్రేమించారు. అమెరికాలో స్వతంత్రవాయువులు పీల్చి తమ దేశాన్నికూడ అమెరికావలె చేయాలని కోరారు. వీరికి ఉరిశిక్ష వేయడమా ? ఈ ఘోరానికి చరిత్ర యేమని పేరిడుతుందో ?

ప్లీడర్లు వైస్రాయికి అప్పీలుచేశారు. ఈలోగా ఖైదీలు ఖూనీకొట్టు లలో పెట్టబడ్డారు. ప్రతిరోజూ తెల్లవారుఝామున కొట్టుముందు బొక్కె నతో నీళ్ళు వుంచబడేవి; ఉరితీయబడేముందు శిక్షితుని స్నానం చేయించు తారు. అందుకే యీ నీళ్ళు. ప్రతిరోజూ ఖైదీలు ఈ నీళ్ళబొక్కెన చూచి ఇదే తమ అంతిమదినం అనుకొనేవారు. కాని ఇలా 14 రోజులు జరి గాయి. ఇలా మృత్యువుకోసం వేచివుండడం యమయాతన.

పృధ్వీసింగు యీ రోజులలో మిత్రుడిచ్చిన భగవద్గీత చదివాడు. సరిగా అర్థంకాలేదు. కాని అంతరాత్మయొక్క అమరత్వంతెలిపే భాగాలు ఆకర్షించాయి.

భాయి పరమానంద ఎం. ఏ. పి. హెచ్. డి. కూడా యీకేసులో ముద్దాయి. ఉరిశిక్షపడింది. నిజానికి వీరికి ఉద్యమంతో యెట్టి సంబంధం లేదు. అన్యాయంగా యిరికించారు. ఉరిశిక్ష చెప్పారని యీయన క్రుంగి పోయాడు. కాని తక్కినవారిధైర్యం యీయనలో ఉత్సాహాన్ని కలుగ చేసింది.

1915 మే 1 తేదీన వైస్రాయికి అప్పీలు ఫలితం తెలిసింది. 7 గురి ఉరిశిక్ష ఖాయమయింది. కర్తార్‌సింగు, పింగళే, జగత్‌సింగు, ఝూలియాసింగు, హర్నామ్‌సింగు, సావన్‌సింగు, మరింకొకరికి ఉరిశిక్ష ఖాయపడింది. తక్కినవారి ఉరిశిక్ష యావజ్జీవ ద్వీపాంతర శిక్షగా మార్చబడింది.

సర్దార్ కర్తార్‌సింగు పృధ్వీసింగును బాగా ఆకర్షించాడు. "ఉరిశిక్ష తప్పితే జీవితపర్యంతం పోరాటం వదలకు. శిక్ష పూర్తి అయి బయటకు వెళ్లేదాకా కూర్చోవద్దు. మనోనిశ్చయముంటే జైలుగోడలు, ఇనుప కటకటాలు నిన్ను అడ్డగించలేవు." అని ఉత్సాహ పరచేవాడు.

కర్తార్‌సింగు అబద్ధం చెప్ప నిరాకరించాడు కాబట్టి ఉరితీయబడ్డాడు. పింగళే డిఫెన్స్ పెట్టలేదు కాబట్టి ఉరి. ఇలా భారత స్వాతంత్రయోధులు 7 గురి ప్రాణాలు బలియైపోయాయి. కాని నానాటికి వృద్ధిపొందుతున్న స్వాతంత్రోద్యమంలో వారికృషి జీవించేవుంది.

పండిత జగత్‌రామ్ యీ 7 గురి కామ్రేడ్స్ ఉరిపై ఒక విషాద గీతాన్ని వ్రాశాడు.

"సైరా కర్తారు వీర
మీ - కంటి నెత్తురు జీర
భారత వీరుల భావవీధిలో
తళతళలాడుతు వెలుగుతున్నది ॥సైరా॥

దేశభక్తు లావేశముతో ముం
దడుగువేతురా వెలుగులోననే ॥సైరా॥

ఉరికంబాలకు ఎరయైపోయిన
మీ పేరిటిదే రక్త పతాకం ॥సైరా॥

మరచిపోము మీ పరిభవాగ్ని మా
నరనరమ్ములో చరచరలాడెడి ॥సైరా॥

భారత వీరుల భావవీధిలో
తళతళలాడుతు వెలుగుతున్నది ॥సైరా॥



## రెండవ భాగం

# అండమాన్ దీవులలో

పృధ్వీసింగును ఇతర శిక్షితులతో కలిపి 18 మందిని ప్రభుత్వం అండమాన్ ద్వీపాలకు పంప నిశ్చయించింది. ఒక అర్ధరాత్రివేళ లారీ వచ్చింది.. కాపలాకు వచ్చిన యూరోపియన్ పోలీసులతోసహా ఖైదీలు ఒకే లారీలో కుక్కబడ్డారు. మొగల్‌పురా రైల్వేస్టేషనుకు తీసికెళ్ళారు. ప్రత్యేకంగా ఒక పెట్టెలో అందరినీ ఎక్కించారు. అది కలకత్తామెయిల్‌కు తగిలించబడింది.

ఖైదీలలో ఇద్దరిద్దరికి కలిపి చేతులకు సంకెళ్లు తగిలించబడ్డాయి. ఎల్లపుడూ కూర్చునేవుండాలి. నిదురపోడానికి అవకాశం లేదు. దొడ్డికి వెళ్ళవలసివచ్చినా సంకెళ్లు తీయలేదు. సంకెళ్లువేయబడిన రెండోమనిషి కూడ వెంటబోవలసి వచ్చేది. ఏమి నాగరికత అని చెప్పాలి ?

ఎన్ని కష్టాలు పెట్టినా మన దేశభక్తులు ఉత్సాహాన్ని వీడలేదు. స్టేషను వచ్చినప్పుడల్లా విప్లవగీతాలు పాడేవారు. యూరోపియన్ పోలీసులు అందుకు ఏమీ అడ్డు చెప్పలేదు. 18 మంది ఖైదీలు వున్నారా లేదా అనేది మాత్రమే వారిసమస్య. దేశభక్తుల విప్లవగీతాలు విని స్టేషన్లలో ప్రజలు పోగయ్యేవారు. తమ దేశంకొరకు స్వాతంత్ర్యం కావాలని కృషి జేసిన భారతపుత్రులు అండమాను దీవులకు పంపబడుతున్నారనే వార్త ప్రజల హృదయాలను జలదరింపజేసేది. మరల మన సోదరులను రక్షించుకోగలమా అనే ప్రశ్న వారి కండ్లయెదట తాండవమాడేది.

రైలుబండి 3 రోజులకు హౌరాస్టేషనుకు చేరింది. ఆ రాత్రికి ఖైదీలను ఆలీపూర్ సెంట్రల్ జెయిలులో బంధించారు.

'మహారాజా' అనే స్టీమరు రేవులో సిద్ధంగా వుంది. రాజకీయ ఖైదీలతోపాటు కొందరు క్రిమినల్ ఖయిదీలుకూడ ఆ ఓడలో అండమాను దీవులకు పోతున్నారు. వాళ్లు అచటిజైలు ఘోరాలు వర్ణించి చెప్పారు. మాతృభూమిని వదలిపోతూంటే పృధ్వీసింగుకు కష్టమనిపించింది. ఇంత కంటే ఉరికంబమే మెరుగేమోనని అనిపించింది. అబ్బ ! 20 ఏండ్లు ! ఎంత దీర్ఘకాలం గడపాలి ?

# భూలోక స్వర్గమా?

అండమాన్ జైలులోకి కాలిడటంతోనే జైలరు ఎదురయ్యాడు. ఖైదీలను బాధపెట్టడంలో అతడు ప్రఖ్యాతి వహించాడు. పేరు మిష్టర్ బారీ. స్థూలకాయుడు. బొర్ర ముందుకు పొడుచుకువచ్చి వికృతంగా కన్పించుతాడు. రాజకీయఖైదీలను చూడగానే పకాపకనవ్వాడు; "రాజ్యం సంపాదించేవాళ్లు! రాజ్యం కావాలంట! రాజ్యం! రాజ్యంకాదు; నెత్తి మీద రాయిపెడతాం" అని ఇకిలించాడు.

మనవాళ్ళు బారీని మతిచెడినవాడిక్రింద లెక్కించి నవ్వారు. ఖైదీలు తనముందు నవ్వడమా? జైలరు మండిపోయాడు. వాడు తిట్టేతిట్లు ఆ స్థూలకాయంలోనుంచి బయల్వెడలే గర్జనలవలే వినిపించేవి. అంత శరంలో కూడ కించెత్ హృదయంకూడా లేదేమో! ఆ జైలరంటే ఖయిదీలకేకాదు! ఆ దీవిలోని ప్రజలకంతా హడలు!

జైలులో 7 బ్లాకులున్నాయి. 740 కొట్లు (సెల్సు) వున్నాయి. లాహోరు కుట్రకేసు బందీలను విడదీసి 2 లేక 3 చొప్పున ప్రతిసెల్లుకు మార్చారు. జైలుదుస్తులిచ్చారు. చెప్పులు తీసుకున్నారు. ఆ గులకరాళ్ళ నేలమీద నడవడం కష్టం. అందులోనూ అలవాటుగా చెప్పులు తొడిగే పంజాబీలకు మరీ కష్టమనిపించేది.

పృధ్వీసింగును 2 వ నెంబరు బ్లాకులో పెట్టారు. ఆ బ్లాకులో 105 గురు ఖైదీలున్నారు. భోజనానికి రెండు వరుసలుగా కూర్చునేవారు. హిందువులొకవైపు - బర్మావారు, ముస్లిములు మరొకవైపు. 2 చపాతీలు, కూర, పప్పు ఇచ్చేవారు. తినడం పూర్తిగాకుండానే తొందరపెట్టేవారు. వెంటనే ఇద్దరిద్దరుగా ఫైలులో కూర్చోండని ఆర్డరువచ్చేది.

పృధ్వీసింగును మేడపై కొట్టులోపెట్టారు. పక్కకొరకు కంబళి యిచ్చారు. కాలకృత్యాలు తీర్చుకోడానికి చిన్నకుండవుంది. ప్రొద్దుటే లేవగానే ఇద్దరిద్దరుగా ఫైలులో కూర్చోవాలి. లెక్కపెట్టాక గంజి యిచ్చేవారు.

తరువాత పనియిస్తారు - కొబ్బరిడిప్పలు ఇచ్చారు. 40 పౌనులు డిప్పలనుంచి నారతీసి, శుభ్రంగా కట్టలుకట్టాలి. పృధ్వీసింగుకు బలం

వుంది. కాని ఎలా పనిచేయాలో తెలియదు. ఒక క్రిమినల్ ఖైదీ డిప్పలు తడపాలని ఉపాయం చెప్పాడు. అతడు ఒక ముస్లిం రాజపుత్రుడు. ఇవ్వాలసిన 18 ఔన్సుల నారను చక్కగా శుభ్రపరచి కట్టలుకట్టాడు.

పండిత పరమానంద్ పని పూర్తిచేయలేకపోయాడు. వార్డరు అతనిని జైలరువద్దకు తీసుకువెళ్ళాడు. జైలరు 'బారీ' తిట్టసాగాడు. పరమానంద్ తిరిగి వాడి పాఠం వాడికే అప్పగించాడు. క్రింద ఉద్యోగులముందు ఖైదీ మళ్ళీ తిట్టడమా? బారీ సహించలేకపోయాడు. కొట్టడానికి మీదిమీదికి వచ్చాడు. అతనికంటే ముందుకు పొడుచుకొచ్చిన బారీ బొర్రమీద పరమానంద్ యీడ్చి తన్నాడు. బారీ ఖాళీపీపావలె దొర్లాడు.

వార్డర్లు పరమానంద్‌ను లాఠీలతో బాదారనేసంగతి వేరుగా చెప్పనక్కరలేదు. ఈ వార్త ఖైదీలందరిలో వ్యాపించింది. 'బారీకో పీటా! సాలేకో పీటా' అని అంతా సంతోషించారు.

జైలు సూపరింటెంటు మేజర్ ముర్రే. అతడు మరునాడు ఖైదీలను పరీక్షచేయడానికి వచ్చాడు. దెబ్బలతో పడివున్న పరమానంద్‌ను చూచి "కుక్క ఇలా ఎందుకు పడివుంది?" అని అడిగాడు. పరమానంద్ తిరిగి పాఠం అప్పగించాడు "నీవు కుక్కవు. నీ బాబు కుక్క" అని చీవాట్లు పెట్టాడు. ఇక పరువుదక్కదని సూపరింటెంటు వెళ్ళిపోయాడు.

పరమానంద్ దెబ్బలకు మందైనా వేయలేదు. అదనంగా "జైలు దేవుళ్ళను యెదిరించినందుకు దెబ్బలు శిక్షవేశారు. ముక్కోణానికి కట్టి 20 దెబ్బలు" కొట్టారు.

---

# జైలులో సమ్మె

జైలు అధికారుల క్రూరత్వానికి వ్యతిరేకంగా పోరాటం సాగించాలని రాజకీయ ఖైదీలు నిర్ణయించుకున్నారు. పనిచేయ నిరాకరించారు. ఈ విధంగా జైలులో రాజకీయ సమ్మె ప్రారంభమైంది. దీనిలో సావర్కారు సోదరులు భాయి పరమానంద్, వీరేంద్రఘోష్‌లు చేరలేదు.

సమ్మెలోచేరిన కామ్రేడ్స్ అందరి టిక్కెట్లుపైన ప్రవర్తన చెడ్డదని రిమార్కులు వ్రాయబడ్డాయి. అందరికి 7 రోజులు నిలువు సంకెళ్లు

వేయబడ్డాయి. 6 నెలలు సంకెళ్లు వుంటాయి. 6 నెలలు ఒంటరికొట్టులో బంధించబడతారు. 6 నెలలు వారికి శిక్షగా భోజనంకూడతగ్గించబడుతుంది.

ఒంటరిగా కొట్టులో ఒక్కొక్కరే బంధించబడ్డారు. కొట్టులో పక్క తీసివేయబడింది. మూత్ర విసర్జనకు కుండసైతంలేదు. ఒక బ్లాకులో ఉన్న వాళ్లే కలుసుకోకూడదు. క్రిమినల్స్‌నుకూడ దగ్గరకు రానివ్వలేదు. రోజుకు మూడుసార్లు మాత్రం తలుపుతీసేవారు. ఉదయం గంజి ఇవ్వడం మాని వేశారు. రెండుసార్లు కొంచెం అన్నం, పులుసు, రెండు చపాతీలు ఇచ్చే వారు. పంజాబీలకు అన్నంతినే అలవాటు లేదుకాబట్టి వదలివేశారు. ఆజానుబాహులు; 5 అడుగుల 8 అంగుళాలకు యెవరూ తక్కువగాని ఆ పంజాబీ కామ్రేడ్స్‌కు 2 చపాతీలు యేమూల ?

ఈ పోరాటం జరుగుతుండగా లాహోరునుంచి ఇంకో కొత్తదళం ఖైదీలు 25 గురు వచ్చారు. వారుకూడ వెంటనే జైలులోని సమ్మెలో చేరారు.

అదివరకు రాజకీయ ఖైదీలు తమ కేదైనా అన్యాయం జరిగితే పిటీషన్లు పెట్టేవారు. బారిష్టరు సావర్కారుసైతం నూనెగానుగ త్రిప్పేవాడు. అంతేగాని తిట్టుకు తిట్టు, దెబ్బకు దెబ్బతో సమాధానం యెన్నడూలేదు. వారికి యిది కొత్త అనుభవం. అందుచే భయపడసాగారు. 100 మంది కాన్విక్టు వార్డర్లు చాలరని 10 మంది యూరపియన్ సైనికులనుకూడ సహాయం తెచ్చుకున్నారు శాంతిని కాపాడటానికి.

ఈ సమ్మె కాలంలోనే ఒకరోజున పృధ్వీసింగుకు జబ్బుచేసి. డోకులూ - విరేచనాలయ్యాయి. అధికారులకు రిపోర్టుచేసినా మందు యివ్వలేదు. ఖైదీచెప్పిన ఏదో ఆకు ( జైలులోదొరికేది ) తింటే ఆగిపో యాయి. మరునాడు ఉదయం జైలరు బారీవచ్చి చూచి " సాలా మరా నహీ " ( చావలేదా వెధవాయి ) అని సణిగాడు.

## ఉద్యోగస్థులు హడల్

మళ్ళీ ఆ గదిలోనే పృధ్వీసింగును లాకప్ చేయాలని వార్డర్లు ప్రయ త్నించారు. ఆ కొట్టు వాసనకొడుతూంది. ప్రక్కనే 40 గదులు ఖాళీగా వున్నాయి. దానిలోకి వెళ్ళనని పృధ్వీసింగు నిరాకరించాడు. ఇద్దరు వార్డర్లు లోపలికినెట్టి తలుపువేయడానికి దగ్గరకు వచ్చారు. అంటుకున్నారా చస్తా రని పృధ్వీసింగు బెదిరించాడు. ఇంక దగ్గరకు రావడానికే వార్డర్లు జంకారు.

ఈ తమాషా చూస్తున్న యూరపియన్ సోల్జరు పకపకా నవ్వసాగాడు. మంచి కొట్టులోకి పృధ్వీసింగును వెళ్ళనిచ్చారు.

ఇలాగే సర్దార్ భీషణసింగును ఒకరోజున అసహ్యంగావున్న కొట్టులోకి వెళ్ళమంటే నిరాకరించాడు. జైలర్ బారీ తనఏజెంట్లను పదిమందిని పంపించాడు. సర్దార్ 6 అడుగుల మనిషి 220 పౌన్లు బరువుంటాడు. ఆజానుబాహుడు. గంభీరంగా "దగ్గరకు వచ్చినవాడిని తాటిమట్టలా చీలుస్తాను. ఎవరు చావాలని కోరుతున్నారో రండి!" అని సవాలు చేశాడు. జైలర్ బారీ నూరు గజాల దూరాన నిలచుని చూస్తున్నాడు. ఎవడూ కర్రతో కొట్టటానికి కూడ ధైర్యం వహించలేదు. ఏమంటే అది లాక్కొని వాడిని చంపుతాడని ఎవడికి వాడికే భయం. గౌరవంగా అంతా వెనక్కి తగ్గారు. అందువల్ల సర్దార్ భీషణసింగును మంచికొట్టులోకి వెళ్ళనిచ్చారు.

ఇలాంటివెన్నో సంఘటనలు జరిగాయి. వీటివల్ల క్రిమినల్ ఖైదీలలో రాజకీయ ఖైదీల యెడల గౌరవం, సానుభూతి హెచ్చింది. జైలరు పెద్దగార్డు సహాయంతోగాని రాజకీయఖైదీల దగ్గరకు రాడానికే జంకసాగాడు. ఇండియా ప్రభుత్వానికి వ్రాసిన రిపోర్టులలో లాహోరు కేసు ఖయిదీలను బారీ 'తోడేళ్ళ గుంపు' అని వర్ణించాడు.

సంకెళ్ళు అలవాటయ్యాక నడుస్తూంటే తాళం వేసినట్లుండేది. 6 నెలలు అయ్యాక తీసివేశారు. 20 నెలల తరువాత ఒంటరి కొట్టులో బంధించడం మానివేశారు; సమ్మె అంతమయింది.

కాని జైలరు బారీ ఏదో పేచీపెడుతూండేవాడు. ఖైదీలు శాంతంగా వుండాలనుకొన్నా వుండనిచ్చేవాడుకాడు. ఆదివారం పనిచేయాలని ఆర్డరు వేశాడు. కాని వార్డర్లు తగవెందుకని యిది అమలు జరుపలేదు. ఒకరు మాత్రం 7 గురు కామ్రేడ్స్‌పై పని చేయలేదని సూపరిండెంటుకు ఫిర్యాదు చేశాడు. అతడు విచారించకుండానే 6 నెలలు బేడీలు, ఒంటరికొట్టు వగైరా శిక్షలు వేశాడు. జరిగిన అన్యాయం గురించి పృధ్వీసింగ్ సూపరిండెంటుకు ఫైలులో తెలియజేశాడు. అందుకు పృధ్వీసింగుకు 6 నెలలు కాళ్ళకు బేడీలు శిక్షపడింది. 'దున్నపోతు యీనిందంటే దూడను కట్టివేయమనే మూర్ఖులు' ఇలాంటివాళ్ళే కాబోలు!



# మరో జనరల్ సమ్మెకు కారణాలు

సిక్కులకు తలంతా జుట్టు వుంటుంది. గడ్డం పెంచుతారు. అది వారి మత సాంప్రదాయం. 1915 తరువాత అండమాన్ జైలులో 40 మంది సిక్కు ఖైదీలున్నారు. జుత్తు శుభ్రంగా వుంచుకోడానికి వారికి నూనె - సబ్బు అవుసరం. కాని జైలు అధికారులు ఇవ్వలేదు. జైలులో ఒక విధమైన ఆయిల్ కేక్ (తెలికపిండి) దొరుకుతుంది. అది జుట్టు రుద్దుకోడానికి ఉపయోగపడుతుంది. కాని అది వుపయోగించినందుకు అధికారులు సిక్కు కామ్రేడ్స్‌కు శిక్షవేశారు. పృధ్వీసింగు వారితో కలసి పోరాడటానికి తానుకూడ సిక్కునని చెప్పుకొన్నాడు.

బెంగాలీ కామ్రేడ్ అష్‌తోష్‌ముఖర్జీ ఆరోగ్యం చెడింది. అందుచే 2 పౌన్లు నార తయారు చేయలేకపోయాడు. ఆ కామ్రేడ్‌కు జైలు అధికారులు దెబ్బల శిక్షవేశారు. జైలరు బారీ యిదేవిధంగా ఏదో పేచీ తెచ్చేవాడు. బాబా జ్వాలాసింగ్, అమరసింగులను అనవసరంగా తిట్టాడు. యిలాంటి పేచీలు మళ్ళీ పోరాటానికి దారి తీయసాగాయి.

భాన్‌సింగ్ 60 యేండ్ల వృద్ధుడు, మితభాషి. చదువురాదు. ఒకరోజున కొట్టులోవున్న భాన్‌సింగును అనవసరంగా జైలరు తిట్టాడు. కోపంతో భాన్‌సింగ్ తిరిగి అప్పగించాడు. బారీ 8 వార్డర్లతో వచ్చాడు. తలుపు తెరిచి కొట్టులోనే ఆ వృద్ధుని కర్రలతో బాదించాడు. భాన్‌సింగ్ మరణించాడు.

రాత్రి కొట్టులో వుండగా పృధ్వీసింగ్‌కు యీ వార్త తెలిసింది. అమెరికానుంచి భాన్‌సింగ్ ఎలా బయలుదేరివచ్చాడో ఒక్కసారి జ్ఞాపకం వచ్చింది. భాన్‌సింగ్ అమెరికాలో వుండగా ఒకరైతు పొలంలో వ్యవసాయకూలీగా పనిజేసేవాడు; నెలకు 75 డాలర్లు సంపాదించేవాడు. పృధ్వీసింగ్ తన భారతదేశ ప్రయాణాన్నిగురించి చెప్పి శెలవు తీసుకరాడానికి అతనివద్దకు వెళ్ళాడు. అంతావిని భాన్‌సింగ్ యిలా అన్నాడు: "పసిపిల్లలు! మీరంతా యుద్ధంలోకి వెళ్ళేవారా? ముసలాడిని నేను వెనకవుండేవాడినా? సిగ్గుకాదా?" అని తానుకూడా బిచానా కట్టాడు. తానుమాతృదేశానికి స్వాతంత్ర్యం తెచ్చే యాత్రికుడై బయలుదేరాడు. అంతే. అతడు మాతృ

దేశాన్ని ప్రేమించాడు. దాని స్వాతంత్ర్యం ఆశించాడు. మరే నేరం చేయ లేదు. అండమానులలో దుర్మార్గుడు బారీ చేతుల్లో ప్రాణాలుకోల్పోయాడు.

ఈ చిత్రవధ జైలులోని రాజకీయఖైదీలందరినీ కల్లోలపరచింది. క్రిమినల్ ఖైదీలపై వారికి మంచి పలుకుబడివుంది. తలిస్తే జైలరును, సూపరిండెంటును ఒకదెబ్బతో హతమార్చగలరు. కాని వారు టెర్రరిస్టులు కాదు. వ్యక్తుల్ని చంపడం వారి ఉద్దేశ్యం కాదు. అందుచే భాన్‌సింగు మరణానికి అసమ్మతి తెలుపడానికి జనరల్‌సమ్మె ప్రారంభించారు.

మొత్తం రాజకీయఖైదీలు 85 మంది వున్నారు. వారిలో 45 మంది మాత్రమే సమ్మెకు తయారయ్యారు; అనారోగ్యంగా వున్నవారు నిరసన సమ్మె(ఉపవాసం)చేయనక్కరలేదని నిర్ణయించారు. భాయి పరమానంద్, బరీన్‌ఘోష్, సావర్కారు సోదరులు సమ్మెలో చేరలేదు. వీరందరికీ స్వంత వంట వగైరా సౌకర్యాలున్నాయి. అందుచే వారి దృక్పథం పృధ్వీసింగుకు వారియెడల వున్న గౌరవభావాన్ని తగ్గించింది.

గదర్‌పార్టీ అధ్యక్షుడు బాబా సోహన్‌సింగ్ మధ్యాహ్నం భోజనం మానివేశాడు. దానితో నిరశనసమ్మె ప్రారంభమయింది.

## ఉపవాసం

ఈ వార్త పృధ్వీసింగుకు తరువాత తెలిసింది. సాయంకాలము భోజనం మానివేశాడు. మంచినీళ్లు మాత్రము తాగి కొట్లోకి వెళ్ళాడు. ఆలోచించసాగాడు. సమ్మె ఉద్దేశ్యం ఏమిటి? ఉద్రేకంతో మంచినీళ్ళు కూడ మానివేయాలని నిశ్చయించుకొన్నాడు.

మరునాడు ఉపవాసం చేసే ఖైదీలందరికి అధికారులు సంకెళ్లు తగి రించారు. గదిలోనే 24 గంటలూ లాకప్. ప్రతిపూటా వార్డరు నీళ్ళు—భోజనం తెచ్చి కొట్టులో పెట్టిపోయేవాడు. ఆకర్షింపబడి తింటాడేమోనని వాళ్ళ ప్రయత్నం. కాని అలా మూడు రోజులు గడచిపోయాయి. పృధ్వీసింగ్ భోజనంగాని, మంచినీళ్ళుగాని ముట్టలేదు.

నాలుగవ రోజు. పృధ్వీసింగ్‌గొంతు ఎండుకు పోతూంది. అబ్బ! దాహం! దాహం పృధ్వీసింగును నీళ్ళపాత్రవద్దకు తీసుకుపోయింది. చేత్తో పుచ్చుకున్నాడు. కాని నియమభంగం చేయడానికి యిష్టపడలేదు. క్రింద పెట్టేశాడు. ఒకగంట తరువాత మరల ఇదేవరుస. మూడోసారి పాత్రను చేతితోపుచ్చుకున్నాడు. 'చావాలా! బ్రతకాలా!' అని తన్నుతానే ప్రశ్నించు

కున్నాడు. చావాలనే నిశ్చయమే జయించింది. పాత్రను నేలకేసికొట్టాడు. పాత్రతోపాటు దాహం తీసుకోవాలనే వాంఛకూడ పటాపంచలై పోయింది.

7 వ రోజు రాత్రి. అది చలికాలం. 2 గంటలకు చేతులు-కాళ్ళు చల్లబడ్డాయనిపించింది. పృధ్వీసింగుకు స్పృహ తప్పుతోంది. చావాలనే కోర్కె-వున్నా-అంత త్వరగామాత్రంకాదు. బ్రతకాలనే వాంఛకూడ రెండో వైపునవుంది. కొంచెం ప్రాణాయామం సంగతి తెలుసు. శరీరంలో వేడిని కలిగించడానికి గాలి పీల్చడం ప్రారంభించాడు; ప్రమాదం తగ్గిపోయింది.

9 వ రోజు. సూపరిండెంటు వచ్చి నాడిచూచాడు. గొంగడిలో చుట్టి ఆస్పత్రికి తీసుకుపోయారు. అదిచూచిన ఇతర కామ్రేడ్సు పృధ్వీ సింగ్ చనిపోయాడేమోననుకొన్నారు. వైద్యపరీక్ష చేయబడింది. డాక్టర్లు. కాంపౌండర్లు తిండితినమనిబ్రతిమాలసాగారు. పృధ్వీసింగ్ నిరాకరించాడు.

10 వ రోజున బలవంతాన ముక్కు-ద్వారా ఆహారం ఎక్కించడం ప్రారంభించారు. పృధ్వీసింగు తన్నుకులాడి వ్యతిరేకించాడు. అందుచే ముక్కులోనుంచి నెత్తురుకారింది. కాని అధికారులు వదలలేదు. డాక్టర్లు వార్డర్ల సాయంతో బలవంతాన ఆహారం యెక్కించారు. రెండు రోజుల తరువాత రోజుకు రెండుసార్లు యీ బలవంతపు భోజనం జరిగేది.

బాబా సోహనసింగ్, ఇతర మిత్రులు ఆహారం ఎక్కించుతూంటే తన్నుకులాడి వ్యతిరేకించలేదు. అందుచే పృధ్వీసింగును ఆయనవున్న బ్లాకుకు మార్చారు. కాని పృధ్వీసింగు తనపంతం వీడలేదు. మాట్లాడితే గొంతు తడి ఆరిపోయేది. ఆ బాధ తప్పించుకోడానికి మాట్లాడటం మాని వేశాడు. ఇందుకు జైలరు సంతోషించాడు. పృధ్వీసింగును రెచ్చగొట్టి మాట్లాడించడానికి తిట్టేవాడు. కాని పృధ్వీసింగు వాడిమాటలకు ఏమాత్రం చలించలేదు. మౌనవ్రతం ఆరంభించిన రెండురోజులకు అధికారులు పృధ్వీసింగును జైలు ఆస్పత్రికి మార్చారు.

ఇలా రెండునెలలు గడిచిపోయాయి. 60 దీర్ఘమైన రోజులు! కాని ఆశించిన చావు దగ్గరకు రాలేదు. ఒక ఫలితంమాత్రముంది. అధికారులు జాగ్రత్తగా మెలగసాగారు. జైలరు బారీ నోటిదూల తగ్గింది. కారణం ఏమిటి?

ఈసమ్మె కబురు భారతదేశానికిచేరింది. భారతప్రజలు తమ సోదరుల ప్రాణాలను కాపాడటానికి ఆందోళన ప్రారంభించారు. పత్రికలు అండమాన్ దీవులలో రాజకీయ ఖైదీల కష్టాలనుగురించి వర్ణించసాగాయి.

జైలు అధికారులు యికనుంచి బాగా చూస్తామని వాగ్దానం చేయసాగారు. అందుచే బాబా సోహన్‌సింగ్, ఇతర మిత్రులు నిరసనదీక్ష మానివేశారు.

కాని భాన్‌సింగును ఖూనీచేసిన దుర్మార్గులను శిక్షించడానికి అంగీకరించలేదు. అందుచే పృథ్వీసింగు సమ్మె ఆశయం నెరవేరలేదనుకొన్నాడు. మిత్రులుకోరినా నిరసనదీక్ష మానకుండా సాగించాడు.

ఒకరోజున జబ్బుగావున్న క్రామేడ్సుకు అధికారులు పడకగాని, దుప్పటిగాని యివ్వడంలేదని పృథ్వీసింగుకు తెలిసింది. ఇతర మిత్రులకు లేని సౌకర్యం తనకెందుకని పడకను తీసిపారవేశాడు. గుడ్డలన్నీ బయటకు విసిరేశాడు. శరీరానికి మిగిలిన అలంకారమల్లా సంకెళ్ళు మాత్రమే. పద్మాసనం వేసికొని 24 గంటలూ కూర్చునేవాడు. జైలులోని మిత్రులకు ఈవార్త గాభరాగల్గించింది. అసలే ఉపవాసంవల్ల బలహీనంగా వున్నాడు. 160 పౌనుల బరువునుంచి 98 పౌనులకు తగ్గాడు. దిగంబరుడై చలికి ఎలా తట్టుకోగలుగుతాడా అని భయపడసాగారు.

ఆ రోజులలో పృథ్వీసింగు దినసరి కార్యక్రమం యిలావుండేది. ఉదయం 10 గంటలకు బలవంతపు భోజనం. తరువాత పద్మాసనంపై కూర్చునే నిదురపోయేవాడు. సాయంకాలం 5 గంటలకు మరల బలవంతపు భోజనం. మరల పద్మాసనంపై కూర్చోడం జరిగేది. రాత్రిళ్ళు చల్లని నేలతాకిడికి గడ్డకట్టకుండా శరీరమంతా రుద్దుకునేవాడు. ఎల్లపుడూ యిలా ఎవరితో మాట్లాడకుండా వుండటం, పద్మాసనంపై ధ్యాన నిమగ్నుడై కూర్చోడం; ఇవి చూచిన వార్డర్లు, ఖైదీలు పృథ్వీసింగు తపస్సులో వున్నాడనుకొనేవారు; భగవంతుడు కనబడుతున్నాడని అనుకునేవారు; ఎంతో భక్తితో చూచేవారు.

ఒకరోజున కమ్మరివచ్చి పృథ్వీసింగు సంకెళ్లు తీసివేశాడు. వార్డర్లు పృథ్వీసింగును ఎత్తి గది అంతా చాపలుపరిచారు. అక్కడనుంచి ఆ కొట్టు తలుపులు 14 రోజులు అలాగే తెరిచివుంచారు. ఇంతలో బర్మా కుట్రకేసు ఖైదీలు వచ్చారు. వారు కూడ రావడంతోనే సమ్మెలో చేరారు.

సమ్మెఫలితంగా చాలమంది ఆరోగ్యం చెడిపోయింది: పృథ్వీసింగు 90 పౌన్లకు తగ్గిపోయాడు; కాని సమ్మెఫలితం నెరవేరలేదు. 155 వ రోజున అనగా 5 నెలల తరువాత పృథ్వీసింగు నిరశనదీక్ష మానివేశాడు. సమ్మె ఆపుజేసి అంతా పనిచేయసాగారు,

జైలరు బారీ 2 యేండ్లు సెలవు తీసికొని యింటికి పోయాడు. తిరిగి అండమానులకు రాలేదు. తర్వాత ఎంతో కాలం జీవించలేదు. కొత్త జైలరు పెద్దమనిషి. అనవసర తగవులు, చిక్కులు తెచ్చేవాడు కాదు. సూపరిండెంటు మేజరు ముర్రీ జాగ్రత్తగా మెలగ సాగాడు.

అండమానులోని భారతఖైదీలను స్వదేశానికి మార్చాలని భారత ప్రజలు చేసిన ఆందోళన ఫలించింది. ముందుగా సావర్కారు గ్రూపును బొంబాయి పంపారు. తరువాత బెంగాలీ ఖయిదీలను బెంగాల్ పంపించారు.

చిట్టచివరకు పంజాబీలను తీసుకుపోడానికి 'మహారాజా' ఓడ వచ్చింది. ఏ రాష్ట్రమూ లాహోరు కుట్రకేసు ఖైదీలను తమ జైళ్ళలో వుంచడానికి అంగీకరించలేదు. మద్రాసురాష్ట్రం ఒప్పుకుంది. 'మహారాజా' ఓడలోఎక్కి 1921 అగష్టు 20 వ తేదీన పృధ్వీసింగు, అతనితోడి కామ్రేడ్సు మాతృదేశానికి ప్రయాణమయ్యారు. అండమాన్ దీవులకు ఆత్మీయులైన 8 గురు కామ్రేడ్స్‌ను బలియిచ్చి భారతదేశానికి వీరు తిరిగి వచ్చారు.

## మద్రాసు జైళ్లలో

ఓడ దిగగానే ఖైదీలందరినీ మద్రాసు పెనిటెన్షరీ జైలుకు తీసుకుపోయారు. అచట వారిని ముగ్గురు లేక నలుగురు వంతున దళాలు దళాలుగా విడదీశారు. ఒక్కొక్క దళాన్ని రాష్ట్రంలోని ఒక్కొక్క జైలుకు పంపారు. పృధ్వీసింగ్, సర్దార్ ఖేర్‌సింగ్, సర్దార్ కుషల్‌సింగ్— యీ ముగ్గురిని ఒక దళంలో చేర్చారు. రాజమండ్రి జైలులో వుంచడానికి కమాన్ యెత్తారు.

సాయంత్రం కలకత్తా మెయిలులో రాజమండ్రికి ప్రయాణం. ముగ్గురు పోలీసుల కాపలాతో పృధ్వీసింగ్ దళం రైలుబండిలో బయలు దేరింది. ఖైదీలు ముగ్గురూ బలవంతులైన పంజాబీలు. పోలీసులు ఉసుర్మి యాలు. వీరిని బోల్తా కొట్టించడమంటే లెక్కలోని విషయంకాదు. 'ఈ బలహీనులవెంట గొర్రెపిల్లలవలె రాజమండ్రి చేరడమంటే సిగ్గుచేటు' అనుకున్నాడు పృధ్వీసింగ్.

## తప్పించుకోడానికి ప్రయత్నం

దోవపొడుగునా సమయంకోసం వేచివున్నాడు. రాత్రి ఒంటిగంటకు రైలుబండి ఒంగోలు స్టేషనుచేరింది బయట కుంభవర్షం కురుస్తోంది. కన్ను పొడుచుకున్నా యేమీ కనిపించడంలేదు. కాపలావాళ్లు కూర్చునే కునికిపాట్లు పడుతున్నారు. రైలుబండి స్టేషన్ ప్లాట్‌ఫారమ్ వదిలింది. సిగ్నల్ స్తంభాలు దాటింది. స్పీడు ఎత్తుకుంది. కిటికీలోంచి పృధ్వీసింగు బయటికి చూచాడు; చీకటి అంధకారంగా వుంది; బయట ఏమున్నదో తెలియదు; తనకాళ్ళకు సంకెళ్లువున్నాయి. అయినా దూకాలని నిర్ణయించు కున్నాడు. ఏ మైలురాయిమీదనో పడి దెబ్బ తినవచ్చును.

కాని స్వాతంత్రేచ్ఛ ఏ ఆటంకాలనూ లెక్కచేయదు. ఏ ప్రమాదా న్నైనా యెదిరించే శక్తినిస్తుంది. వెనుకటి స్వాతంత్ర్య వీరుల నామం స్మరణకుతెచ్చుకున్నాడు. 'వందేమాతరమ్' అని అరుస్తూ, కిటికీలోనుంచి కాలి సంకెళ్ళతో వడిగా పరుగెత్తుచున్న మెయిలుబండిలోనుంచి బయట అంధకారంలోకి దూకాడు..........

భూదేవి వడిలో పడ్డాడు. మోచిప్ప కొట్టుకుపోయింది కీలు తొలి గింది. దెబ్బతట్టుకొని లేచాడు. పోలీసువాళ్ళు బందీ తప్పించుకోగానే అలారం గొలుసు లాగారు. రైలుబండి కొంతదూరంపోయి కిర్రుమని శబ్దంచేస్తూ ఆగిపోయింది.

దానిని చూచి పృధ్వీసింగ్ బలంతెచ్చుకొని పరుగెత్తసాగాడు. వెదికేవారికి కనపడకుండా వుంటానికి రక్కిస పొదలోకి దూరాడు. ముళ్ళతోనిండిన రక్కిసలోకి దూరడమంటే ఎంతో మొండితనంవుండాలి. ఒక పొదలోనుంచి మరొక దానిలోకి సాగిపోయాడు. క్రమంగా పొదలు దాటి వరిచేలలోకి ప్రవేశించాడు. ముక్కుకు సూటిగా పోతున్నాడు. జోరున వాన. చీకటి. బురదలో కాళ్ళు యీడ్చుకొంటూ, అడ్డువచ్చిన ప్రవాహాలు యీదుకొంటూ పోతున్నాడు. ఎటుపోవాలి? పోలీసుల అరు పులు యింకా వినిపించుతూనే వున్నాయి. రైల్వే లైనుకు సాధ్యమైనంత దూరంగా పోవాలనేదొకటే అతని లక్ష్యం.

వెళ్ళగా వెళ్ళగా కొన్నిమైళ్లు నడిచాక, చిన్నదీపం మిణుకుమిణుకు మంటూ కన్పించుతుంది. సూటిగా ఆ వెలుతురువైపు వెళ్ళాడు. శరీరం నిండా ముళ్లు; పైగా రక్తనష్టం. అందువల్ల అలసటవస్తూంది. కొన్ని

గంటలకు చిన్నగ్రామం చేరాడు. మిణుకు మిణుకుమంటూ దీపం కన్పించుతున్న గుడిసెలోకి ప్రవేశించాడు. కిరోసిన్‌బుడ్డి వెలుగుతోంది; ఇద్దరు బీదవాళ్ళు - భార్యాభర్తలుకాబోలు - నిద్దుర బోతున్నారు.

సంకెళ్ళధ్వనికి ఆ స్త్రీ కండ్లు తెరచింది. రాత్రి - పెద్దగడ్డాం, శరీరమంతా రక్తం కారుతున్న భీకరస్వరూపంచూచి భీతితో అరవబోయింది. పృధ్వీసింగ్ ముక్కుపై వేలుంచి అరవవద్దని సంజ్ఞ చేశాడు. ఆమె మాటాడకుండానే నెమ్మదిగా భర్తను తట్టి లేపింది. భర్తకూడ లేచి పృధ్వీసింగ్ ఆకారం చూచి దిగ్భ్రమ చెందాడు.

పృధ్వీసింగ్ సంకెళ్ళనుచూపి వాటిని బ్రద్దలు కొట్టడానికి సాయమడిగాడు. కాని ఒకరిమాట ఒకరికి అర్ధంకాదు. పృధ్వీసింగ్ స్వరాజ్ - దేశభక్త - కాంగ్రెసు అనే పదాలను వల్లించాడు. ఆబీదవాడేదో గ్రహించినట్లుగా కన్పించాడు. గుడిసెలో కనుపించిన కర్రుసాయంతో పృధ్వీసింగ్ సంకెళ్ళను వూడకొట్టివేశాడు. జైలుదుస్తులు తీసి పారవేశాడు. కట్టుకోడానికి ఏదైనా గుడ్డ యివ్వమని అడిగాడు. కాని పాపమాబీదవాడి ఇంట్లో ఏమీలేదు. పగులగొట్టిన గొలుసులు, గుడ్డలు ఎచటనైనా పాతివేయమని పృధ్వీసింగ్ సంజ్ఞలు చేసి చూపాడు. ఆకలి మండిపోతూంది. కాని ఆ బీదవానియింట్లో తింటానికి ఏమీలేదు. తానేమీ సాయంచేయలేకపోయానని ఆ బీదవాడు బాధపడ్డాడు.

తెలతెలవారుతూండగా ఆ బీదవాడు పృధ్వీసింగును వూరిబయటకు సాగనంపాడు. పొలాల్లోపడి నడుస్తూ రైల్వేలైనుకు మరల చేరుకున్నాడు. వాన ఆగిపోయి ఎండవచ్చింది. అలిసిపోయి లైనుప్రక్కనే ఆ ఎండలో నిదురపోయాడు. ట్రైను ధ్వనివిని లేచాడు. కాని వంట్లో శక్తిలేదు. చెట్టు కొమ్మవిరచి కర్ర సంపాదించాడు. దానిపై ఆనుకుంటూ శరీరాన్ని తెనాలివైపు ఈడ్వసాగాడు. పొడుగటి గడ్డాంచూచి సాధువునని చెప్పుకోవచ్చు. కాని శరీరంనిండా గాయాలున్నాయి. లంగోటీ మినహా యేమీ దుస్తులులేవు. అందుచే అనుమానాస్పదంగా కన్పించుతున్నాడు.

కొంతదూరం నడిచాక చిన్న స్టేషనువచ్చింది. పోలీసు యేజెంటు ఒకడు చూచి ఇంటికి తీసుకుపోయాడు. భోజనం పెట్టాడు. స్టేషనుకు రిపోర్టు చేశాడు. కొన్ని నిమిషాలకు పోలీసుదళంవచ్చి అరెస్టుచేసింది. ఈ విధంగా తప్పించుకోడానికి చేసిన ప్రధమ ప్రయత్నం విఫలమైంది. మళ్ళీ పృధ్వీసింగ్ పోలీసుల చేతుల్లో చిక్కాడు.

## ఒంగోలు సబ్‌జైలు

పృథ్వీసింగ్‌ను ఒంగోలు సబ్‌జైలులోపెట్టారు. గాయాలు నయమై లేవగలశక్తి రావడానికి 8 రోజులుపట్టింది. ఈవార్త పట్టణంలో తెలిసింది. సహాయ నిరాకరణోద్యమం ముమ్మరంగా సాగుతున్న రోజులవి. ఒక క్రిష్టియన్ శాసనసభ్యుడు వచ్చి పృథ్వీసింగుతో మాట్లాడాడు. బట్టలు లేక పోవడంచూచి వెంటనే పంపాడు. కాని అవి విదేశీబట్ట లవడంచేత వాటిని పృథ్వీసింగ్ ధరించలేదు. ఈసంగతి వూళ్ళోతెలిసి అనేకమంది దేశ భక్తులు ఖద్దరుబట్టలు పంపారు. కాని పోలీసులు ఆటంకపెట్టారు.

ఆస్పత్రిలో డాక్టరు పృథ్వీసింగ్ శరీరానికి గుచ్చుకొన్న ముళ్ళను తీయలేదు. కాని పృథ్వీసింగ్ ఆరోగ్యం చాలాబాగుంది. అతని శరీరం వజ్రశరీరం. శరీరానికున్న సహజశక్తియే ముళ్ళనన్నిటిని బయటికి క్రమ ముగా తోసివేసింది; ఒక చిన్న గులకరాయిమాత్రం తొడకండలో దూరి పోయింది; నేటికీ అలాగేవుంది.

విచారణకు పృథ్వీసింగ్ మేజస్ట్రేటు కోర్టులోకి రా నిరాకరించాడు. మేజస్ట్రేటు బహిరంగప్రదేశంలో కుర్చీలు - బల్లలు వేయించాడు. అచటే విచారణ చేశాడు. ముద్దాయి తరపున వాదించడానికి ప్రభుత్వ ఖర్చుతో ప్లీడరును పెడతానని మేజస్ట్రేటు చెప్పాడు. కాని పృథ్వీసింగ్ డిఫెన్సు పెట్టుకోనన్నాడు. జైలులోపెట్టే అమానుషబాధలనుండి తప్పించుకోడానికి పారిపోయానన్నాడు. మేజస్ట్రేటు విచారించి ఒకసంవత్సరం శిక్షవేశాడు.

మరునాడు రాజమండ్రి జైలుకు పంపడానికి పృథ్వీసింగును ఇద్దరు పోలీసులకు అప్పగించారు. మేజిస్ట్రేటు సాగనంపుతూ యిలా చెప్పాడు– "నీవు యువకుడవు! ప్రాణాలతో చెలగాటం ఆడవద్దు. బయటికివచ్చి దేశసేవ చేయడానికి అవకాశంవుంది, నిరుత్సాహపడవద్దు." అన్నాడు. కాపలా పోలీసులు సంకెళ్లువేయలేదు. పృథ్వీసింగుకు దణ్ణంబెట్టి "మేము మిమ్మ ఏమీ కష్టపెట్టం, పొట్టకూటికి మేము పనిచేస్తున్నాము. కుటుంబ పోషణకు మాకు మరే మార్గంలేదు. మాకు చిక్కులు తేకండి - బాబూ!" అని బ్రతిమాలారు. వీరిమాటలు పృథ్వీసింగ్ హృదయాన్ని కరిగించాయి. ఒంగోలు స్టేషన్‌వద్ద పృథ్వీసింగును చూడటానికి అనేకమంది ప్రజలు పోగయ్యారు.

రాజమండ్రికి ఈ వార్త ముందుగా తెలిసింది. గోదావరిస్టేషనులో అనేకమంది దేశభక్తులు పోగయ్యారు. పృథ్వీసింగుకు స్వాగతమిచ్చారు. గోదావరికి తీసుకుపోయి స్నానం చేయించారు; విందుచేశారు. తరువాత గుర్రపుబండిలో జైలుకు సాగనంపారు. కాపలా పోలీసులు జైలు అధికారులకు అప్పగించి పృథ్వీసింగుకు దణ్ణంపెట్టి వెళ్ళిపోయారు.

## రాజమండ్రి జైలు

ప్రవేశించినది మొదలు మళ్ళీ పోరాటం తప్పలేదు. జైలరు రాగానే పృథ్వీసింగ్ నిలబడలేదు. జైలరు మండిపడి కొట్టడానికి మీదకు వచ్చాడు. కాని పృథ్వీసింగ్ "ఖబడ్దార్ ! ఎవరితో చెలగాట మాడుతున్నావో తెలుసుకో" మన్నాడు. జైలరు విసుకుతగ్గింది. ఖయిదీ చరిత్ర తెలిపే టికెట్టు చూచాడు; అప్పటినుంచి జాగ్రత్తగా మెలగజొచ్చాడు.

ఫైలు నిలబడే రోజు. సూపరిండెంటు ఖైదీలను పరీక్షించడానికి, వారి కష్టసుఖాలను తెలిసికోడానికి నిర్ణయించబడిన రోజది. తాను వచ్చినపుడు సరిగా నిలబడలేదని పృథ్వీసింగును తిట్టాడు. పృథ్వీసింగు వాటిని వడ్డీతో చెల్లించాడు. ఖయిదీలముందు సూపరిండెంటును తిట్టడమా ? ఖూనీ కొట్లలో పెట్టమని వెంటనే ఆర్డరైంది.

ప్రతిరోజూ ఉదయం జైలరు ఖూనీకొట్లముందుగా వెడుతుండేవాడు. ఎన్నడూ పృథ్వీసింగు లేచి నిలబడేవాడుకాదు. ఒకరోజున జైలరు పుర్రెలో ఏదో పురుగు తొలిచింది. పృథ్వీసింగు పద్మాసనంలో కూర్చుని ధ్యానంలో వున్నాడు. జైలరు కాపలావున్న వార్డర్లతో పృథ్వీసింగ్‌ను బయటికి లాగి నిలబెట్టమన్నాడు. కాని వాళ్ళు అలాచేయ నిరాకరించారు. "సర్ ! ఆయన భగవద్భక్తుడు. రాత్రింబగళ్ళు ధ్యానంలో వుంటాడు. ప్రార్థనలో వుండగా ఆయనను ముట్టుకోడానికి మాకు ధైర్యంలేదు" అని అన్నారు. ఇంక చేసేదిలేక జైలరు ఆ రోజుకు విరమించుకున్నాడు.

మరునాడుదయం తనకిష్టులైన కాన్విక్టువార్డర్లతో జైలరు మళ్ళీ వచ్చాడు. కొట్టు తెరిచారు. దూరాన నిలబడి జైలరు "సాలాకో పకడో" అని అరుస్తున్నాడు. పృథ్వీసింగ్ ధైర్యంవుంటే దగ్గరకు రమ్మని సవాలు చేశాడు. జైలరు దగ్గరకువచ్చి కర్రతో పృథ్వీసింగ్ నెత్తిమీద కొట్టాడు. పృథ్వీసింగ్ దెబ్బతిన్న పులివలె ఉరికి జైలరుగొంతు పట్టుకున్నాడు.

అతని చేతులలో జైలరు గిజగిజలాడాడు. వార్డర్లు కర్రలతో పృథ్వీసింగ్‌ను బాది వదిలించారు. 'బ్రతుకుజీవుడా!' అని పారిపోయాడు జైలరు.

దెబ్బలకు పృథ్వీసింగ్ స్మృతితప్పి పడిపోయాడు. గాయాలనుంచి రక్తం స్రవించుతోంది. కాని జైలు ఉద్యోగులు మందువేయించిన పాపాన పోలేదు. వాళ్ళనుండి ఆ మాత్రం మానుషత్వం ఆశించడం పొరపాటేమో లెండి!

ఈ సంఘటన జరిగాక జైలరెప్పుడూ పృథ్వీసింగ్ జోలికి రాలేదు. ఇంకా కొందరు పంజాబీ ఖయిదీలు రాజమండ్రి వచ్చారు. వీరంతా పోరాటానికి సిద్ధమయ్యారు. సూపరిండెంటు లొంగి పంజాబీలకు ప్రత్యేక వంటశాల యివ్వడానికి అంగీకరించాడు.

మద్రాసురాష్ట్ర జైళ్ళన్నిటిలోనూ యిదేవిధంగా లాహోరు ఖయిదీలకు—జైలధికారులకు పోరాటం సాగుతోంది. జాతీయపత్రికలు, ప్రజలందరూ ఈ విషయమై ఆందోళన చేయసాగారు. లాహోరు ఖయిదీలస్థితిని విచారించడానికి ఒకరాయబారం వచ్చింది. వారు రాజమండ్రి కూడ వచ్చారు. అధికారులతో పోరాడి జైలుజీవితం మరింత దుర్భరం చేసికోవద్దని వారు పంజాబీ ఖయిదీలను కోరారు. నాటినుంచి జైలులో శాంతంగా గడిచిపోసాగింది.

పృథ్వీసింగ్ రోగులకు శుశ్రూషచేయడం, ఖయిదీలకు హిందీ నేర్పడం పనిగా తీసుకున్నాడు. అది 1922 సంవత్సరం. సహాయ నిరాకరణోద్యమంలో వచ్చిన అనేకమంది రాజకీయఖయిదీలు రాజమండ్రి జైలులో వున్నారు. వారికి హిందీ నేర్పడంద్వారా పరిచయం ఏర్పడింది. సాంబమూర్తిగారు, కీ. శే. డాక్టరు సుబ్రహ్మణ్యం మొదలైనవారితో స్నేహం ఏర్పడింది. కాని కొలదిరోజుల్లోనే హిందీక్లాసులను అధికారులు నిషేధించారు. రోగులకు శుశ్రూష చేయడానికిమాత్రం అవకాశంయిచ్చారు.

## శ్రీరామరాజు దాడి

రాజమండ్రి తూర్పుగోదారి జిల్లాలోవుంది. ఈ గోదావరిజిల్లా ఏజెన్సీలోని కోయలువగైరా కొండజాతి ప్రజలను సమీకరించి శ్రీరామరాజు తిరుగుబాటుచేశాడు. ఆ జిల్లాలోని ప్రభుత్వోద్యోగులకు భీతి కలిగించాడు. మూడు సంవత్సరాలు ప్రభుత్వాన్ని ముప్పుతిప్పలుపెట్టి మూడు చెరువుల నీరు తాగించాడు. మిలిటరీ సాయంతోగాని ప్రభుత్వం అణచ

లేకపోయింది. సెంట్రలు జైలుపై రాజు దాడివెడలుతాడని పృధ్వీసింగ్ అచటవుండగా వదంతి బయలుదేరింది. ఈ వార్త ఆధార రహితమైనది. ఐనప్పటికి జైలు అధికారులు గజగజలాడారు. పోలీసు కాపలాపెట్టు కున్నారు. కాని వదంతి వదంతిగానే వుండిపోయింది. దాడి జరుగలేదు.

## ఉత్తర దేశానికి బదిలీ

లాహోరు కేసు ఖయిదీలను ఉత్తరదేశపు జైళ్ళకు పంపాలని ఆందోళన జరిగింది. దీనిఫలితంగా ప్రభుత్వం బదిలీ చేయడానికి అంగీక రించింది. పృధ్వీసింగు, రణధీర్‌సింగు, కర్తార్‌సింగులను నాగపూర్ జైలుకు పంపడానికి నిశ్చయించబడింది.

యూరోపియన్ సార్జెంటు, 7 గురు పోలీసులగార్డుతో (కాపలాతో) నాగపూర్‌కు ప్రయాణం. రాజమండ్రి స్టేషనులోను, బెజవాడ స్టేషను లోను అనేకమంది జాతీయవాదులు పృధ్వీసింగును చూడటానికి పోగ య్యారు. ఈసారి సూపరిండెంటు ఖయిదీలకు సంకెళ్ళు వేయించలేదు. జైలు దుస్తులు విడచి, సాధారణ సిక్కు దుస్తులు ధరించనిచ్చారు.

రైలు ప్రయాణం సాగుతోంది; ఆంధ్రదేశం దాటింది మధ్య రాష్ట్రంలో ప్రవేశించింది. పృధ్వీసింగు కిటికీపక్కనే కూర్చున్నాడు. సార్జెంటు సందేహించి రెండువైపులా పోలీసులను కూర్చోపెట్టాడు. ఈ సంఘటన పృధ్వీసింగును రెచ్చగొట్టింది. సార్జెంటుకు బుద్ధిచెప్పాలనే ఉద్రేకంకలిగింది. అయినా శాంతంగా వూరుకున్నాడు. కాని విద్రలోకూడా అవే ఆలోచనలు. ఒక రాత్రివేళ మెలకువవచ్చింది. మరుగుదొడ్డిలోకి వెళ్ళాడు.

స్వేచ్ఛపొందాలనే భావం ప్రబలజొచ్చింది. చుట్టూచూస్తే ఆ దొడ్డికి చిన్న కిటికీమాత్రం వుంది. అది యీ అవకాశం ఉపయోగించుకో మని ఆహ్వానించుతూందా అన్నట్లనిపించింది. కిటికీలోనుంచి నెమ్మదిగా బయటికి దూరాడు. పరుగెత్తుతున్న రైలులోనుంచి యెగిరి దూకాడు. కాళ్ళమీదనే నిలబడగలిగాడు. ఏమి దెబ్బ తగులలేదు. బానిసత్వానికి — స్వాతంత్ర్యానికి ఎంత తారతమ్యం ? ప్రమాదాన్ని లెక్కచేయకుండా సాహసిస్తే విజయలక్ష్మిని చేబట్టడం ఎంతసులభం !

## మూడవ భాగం

# మరల స్వేచ్ఛాప్రపంచంలో

పృధ్వీసింగు రెండవసారి రైలుదూకింది 1922 నవంబరు 22 వ తేదీన. వెంటనే పరుగుకు లంకించుకున్నాడు. రెండుమైళ్లు పరుగెత్తాక దాహమవసాగింది. ఎచటా నీళ్ళు కనుపించలేదు. ఒక బురదగుంటలో కొంచెంనీళ్లుంటే అవే తాగాడు.

ఈ సారి పృధ్వీసింగు దుస్తులు సాధారణంగా వున్నాయి. చూచిన వారు గడ్డాం, తలగుడ్డవున్న పెద్దమనిషి అనుకుంటారు. ఎవరూ సందేహించరు. నడువగా నడువగా తెల్లవారుఝామున 4 గంటలకు ఒకకంకర రోడ్డుకు చేరుకున్నాడు. ధైర్యవహించి దానివెంటే నడిచాడు. కొంత దూరం నడిచాక ఒకమైలురాయి తగిలింది. దానిమీద అమరావతి రెండు మైళ్లు అనివుంది. ఇంకోమైలు నడిచాడు. యీసారి మైలు రాయిమీద 1 అంకె వేసివుంది. ఇపుడు పృధ్వీసింగుకు స్పష్టంగా అర్ధమయింది. అమరావతి ఇంకో మైలులో వుంది.

పట్టణంలోకి చేరాడు. కాని ఎచటికి వెళ్ళాలో తోచలేదు. వూరిలో ఒకవైపునుంచి మరోవైపుకు వెళ్ళాడు. రోడ్డుప్రక్కన పెద్దకాంపౌండు. గేటుకు 'విద్యార్ధుల వసతిగృహం' అని తెలిపే ఒక బోర్డువుంది. ఒక గదిలోనుంచి విద్యార్ధి బయటికి వస్తున్నాడు. పృధ్వీసింగు అతనిని పిలిచాడు. విద్యార్ధి 'ఏమికావాలి?' అని ప్రశ్నించాడు. అతని సాయం కావాలని పృధ్వీసింగు అర్ధించాడు. విద్యార్ధి మారుమాటాడకుండా గదిలోకివెళ్ళి దుస్తులు వేసుకువచ్చాడు.

"ఈపట్టణంలోకల్లా మంచిదేశభక్తుని యింటికి తీసుకువెళ్ళు? వారితో నాకు తొందరపని వుంది." అని పృధ్వీసింగు విద్యార్ధిని కోరాడు. విద్యార్ధి అతనిని ఒకపెద్దయింటికి తీసుకువెళ్ళాడు; కాని ఆ పెద్దమనిషి వూళ్లోలేడు. ఇంకో జాతీయవాది యింటికి తీసుకుపొమ్మని పృధ్వీసింగు కోరాడు. కాని అచటా యింటియజమాని దొరకలేదు. ఇలా నాలుగిళ్ళకు తిరిగాడు. నాల్గో ఆయన యింట్లోనేవున్నాడు. అతని పేరడిగి తెలిసికొని

పృథ్వీసింగు విద్యార్థిని వెనుకకు పంపివేశాడు. ఆవిద్యార్థిలో గొప్పతనం ఏమంటే, ఇంతదూరం పృథ్వీసింగ్‌తో తిరిగినా ఒకప్రశ్నఅయినా వేయలేదు.

ఇంటియజమాని పృథ్వీసింగును గుర్తుపట్టాలని ప్రయత్నించాడు. ఇంత తెల్లవారు ఝామునే వచ్చిందెవరో అతనికితోచలేదు. పృథ్వీసింగ్‌ను కూర్చోమని ఆహ్వానించాడు. ప్రశ్నార్థకంగా చూచాడు. పృథ్వీసింగు తన పేరూ, చరిత్ర క్లుప్తంగా చెప్పాడు. గృహస్థుడు కలగంటున్నవాడివలె విన్నాడు. తలపంకించాడు. " ఐతే నేను మీకేం సహాయంచేయాలి? " అని ప్రశ్నించాడు. "ముందుగా ఒక కత్తెర, మంగలికత్తె తెచ్చిపెట్టండి." అని పృథ్వీసింగు అడిగాడు. అవి తెచ్చాక అతని సాయంతో శుభ్రంగా క్షౌరం చేసికొన్నాడు. ఖద్దరుబట్టలు, చెప్పులు తెప్పించుకున్నాడు. విడిచిన దుస్తులను తగులబెట్టించాడు. ఒక గంటలో పృథ్వీసింగు కొత్తమనిషి అయ్యాడు. ఖద్దరు దుస్తులతో నాన్‌కోపరేటరువలే ముస్తాబయ్యాడు.

తరువాత ఆ దేశభక్తుడు పృథ్వీసింగును "మీరెచటికివెళ్లాలి? ఎలా వెడతారు?" అని ప్రశ్నించాడు. ఉత్తరదేశంలో ఒకనగరానికి వెళ్ళాలనీ, అచటికి రైలుటిక్కెట్టు కొనిపెట్టమనీ పృథ్వీసింగు అడిగాడు అతడు బీదవాడు; తనవద్ద డబ్బులేదు. అందుచే మిత్రుల సాయం అడగడానికి వెళ్ళాడు. కాని వారీ కథనమ్మలేదు. ఇది అసంభవమన్నారు. సి. ఐ. డి. ఎత్తుఅయి వుండాలన్నారు. ఇతడు రుజువులేమీ చెప్పలేకపోయినా తనకు పూర్తి విశ్వాసముందని నచ్చచెప్పగలిగాడు. తరువాత కావలసిన ధన సహాయం చేశారు. ఆ దేశభక్తుడు టిక్కెట్టుకొని పృథ్వీసింగును రైలు బండిలో ఎక్కించాడు. శెలవు పుచ్చుకున్నాడు.

ఆ విధంగా పృథ్వీసింగు జైలు జీవితగాథ 1922 నవంబరు 30 తేదీతో ముగిసింది. ఆ రోజునే నూతనాధ్యాయం ప్రారంభమయింది. ప్రభుత్వ సి. ఐ. డీలతో దాగుడుమూత ప్రారంభమయింది. నాటినుంచీ గాంధీజీ సలహాపై ప్రభుత్వానికి పట్టుబడిన 1938 మే 13 తేదీవరకు కొత్తజీవితం దాదాపు 16 సంవత్సరాలు పృథ్వీసింగు రహస్య జీవితం గడిపాడు. భారతదేశమంతా తిరిగాడు. మరికొంత ప్రపంచాన్ని చూచాడు. ఎన్నో విచిత్ర సంఘటనలను ఎదుర్కొన్నాడు.

•••○○○•••

# మారువేషంలో జీవితం

అమరావతిదాటాక దోవలో పెద్ద జంక్షన్ వచ్చింది. అచట పోలీసులు ప్రతి పెట్టెను పరిశోధించసాగారు. రాజమండ్రినుంచికూడ ఒక హవల్దార్ వచ్చాడు. వాడు ఎగిరిపోయినపట్టకోసం వెదకుతున్నాడుగాని ఎగిరిపోయిన పిట్టరంగులుకూడా మార్చుకుందనేసంగతిఎరుగడు. ఇంకేమిపట్టుకుంటాడు.

ఇవన్నీ దాటి పృధ్వీసింగు సురక్షితంగా గమ్యస్థానంచేరాడు. అమరావతి మిత్రునివద్దనుంచి జాబు తీసికొనివస్తే బాగుండేది. కాని అలాంటి జాబు దగ్గరవుంటే ఆ మిత్రునికి ప్రమాదమని తీసుకోలేదు. ఎవరివద్దకు వెళ్ళాలో వారి పేరుమాత్రం పృధ్వీసింగుకు తెలుసును. కాని పెద్ద నగరాల్లో అంతమాత్రంతో మనుష్యులను కనుక్కోవడం సులభంకాదుగదా ?

బజారులోకనబడిన మొదటివ్యక్తిని పృధ్వీసింగ్ తనకు తెలిసినపేరు చెప్పి, వారింటికి తీసికుపొమ్మని అడిగాడు. అతనిసాయంతో ఇంటికివెళ్లాడు. ఆ దేశభక్తుడు అప్పుడే పని ముగించుకొని పండుకొన బోతున్నాడు. పిలుపు విని బయటికివచ్చాడు. పృధ్వీసింగును లోనికి ఆహ్వానించాడు.

అతనికి పృధ్వీసింగ్ తన కథనంతా చెప్పాడు. ఆ దేశభక్తుడు మారుమాటాడకుండా విశ్వసించాడు. ఫలహారం తెప్పించాడు. పృధ్వీసింగు తింటూండగా యెచటికోవెళ్ళి ఒక యువకుని తీసుకువచ్చాడు. అతనికి పృధ్వీసింగును యెరుకపరిచాడు. ఆ యువకుడు ఒక విప్లవకారునికి సేవచేసే భాగ్యమబ్బిందిగదా అని సంతసించాడు పృధ్వీసింగును తన వెంట ఒక సురక్షితస్థానానికి తీసుకుపోయాడు. కొంతకాలం అచటవుండి పృధ్వీసింగ్ మరోచోటికి క్యాంపు యెత్తివేశాడు. రహస్యకాలంలో ఇలాంటి సానుభూతిపరు లెందరో పృధ్వీసింగుకు సాయంచేశారు.

ఈ సారి ప్రయాణానికి ఖచ్చితంగా ప్లానువేయబడింది. దారిచూపే వారొకరు కొంతదూరం వెంటవచ్చారు. వెళ్ళే ప్రదేశానికి ముందుస్టేషనులోనే దిగిపోవాలి. అందువల్ల యెవరైనా అనుసరించుతున్నారేమో తెలిసికోవచ్చు. అత్యవసర సమయాల్లో ఆత్మరక్షణకు వినియోగించుకోడానికి ఒక కత్తి దగ్గర వుంచుకొన్నాడు. మిత్రునితో ఆలోచించి పృధ్వీసింగు గుజరాతులోని కథియవార్ సంస్థానంలోకి వెళ్లడానికి నిశ్చయించుకున్నాడు.

# స్వామీరావు

ఆ రోజులలో పృధ్వీసింగుకు భగవంతునియందు, అంతరాత్మ ఉద్బోధనయందు విశ్వాసముండేది. కథియవార్ సంస్థానంలోని భావ నగరం పట్టణంలో ఒక హనుమద్భక్తుడు వుండేవాడు. అతని మఠంలో పృధ్వీసింగు కొంతకాలం గడిపాడు. ఆ భక్తుడు చాల విజ్ఞానవంతుడు. సమాజ సేవకుడు. అతనివద్దకువచ్చే శిష్యులతో పృధ్వీసింగు కలసిమెలసి వుండేవాడు. వారి స్నేహం సంపాదించాడు. అచటివారు పృధ్వీసింగును స్వామీజీ అని పిలిచేవారు. ఇతర ప్రాంతాలనుంచి వచ్చేవారు, అతనిని "భావనగర్‌వాలా స్వామీరావు" అని పిలచేవారు. అప్పటినుంచీ పృధ్వీ సింగు 'స్వామీరావు' అని పేరుతో వ్యవహరించడం ప్రారంభించాడు.

ఈహనుమదుపాసికి భావనగరంలో చాల పలుకుబడివుంది. అచటి సనాతన ధర్మ హైస్కూలులో డ్రిల్లుమాష్టరు పదవి ఖాళీఅయింది. అతని రికమెండేషనుమీద స్వామీరావును ఆపదవిలోకితీసికొన్నారు. హైస్కూలు మేనేజరు ఎంతజీతమివ్వాలి ? అని ప్రశ్నించాడు. హనుమదు యిలా సమాధానమిచ్చాడు. "అతని విలువ ననుసరించి మీరు యివ్వలేరు. మీ శక్తి ననుసరించి యివ్వండి" అన్నాడు. నెలకు రు. 30/- జీతానికి ఉద్యోగం ఖాయం చేయబడింది.

అప్పటికి పృధ్వీసింగ్‌కు శరీర వ్యాయామశిక్షణ తెలియదు. కాని అదినేర్పే ఉపాధ్యాయుడుగా పనిచేయాలి. నిజంగా ఇదొక పరీక్ష. స్వామీ రావు పిల్లలతో కలసిమెలసి వుండేవాడు. వారితో ఆడుకునేవాడు. అండ మానులలో వుండగా నేర్చిన కసరతు చెబుతూ, తానుకూడా నూతన పద్ధ తులు నేర్చుకోసాగాడు.

తరువాత సుప్రసిద్ధుడైన కె. బి. మహల్ అనే నాసిక్ వస్తాద్‌వద్ద శరీర వ్యాయామ ట్రైనింగు పొందాడు. వేసవికాలంలో బరోడాకువెళ్ళి 'మణికిరావుజీ' వ్యాయామమందిరంలో శిక్షణకూడపొందాడు. ఈ విధంగా శరీరవ్యాయామంలో పృధ్వీసింగు నైపుణ్యం సంపాదించాడు. బాలురకు శిక్షణయిస్తూ, కాలం వెళ్ళబుచ్చుతుండేవాడు. బాలురను ప్రజాసేవకులుగా తరిఫీదుచేయడం ఆదర్శంగా పెట్టుకున్నాడు.

ఎగ్జిబిషన్స్, ప్రదర్శనాలు జరిగినపుడు స్వామీరావువద్ద శిక్షణ పొందిన బాలురు వాలంటీర్లుగా పనిచేసి నిర్వాహకుల మెప్పుబడశారు. ఇండ్లు తగులబడినపుడు యీ బాలురే అగ్నిచల్లార్చేదళంగా పనిచేశారు. ప్రజలందరూ యీ బాలుర సేవకు మెచ్చుకున్నారు. తరిఫీదునిచ్చిన స్వామీరావును కొనియాడారు.

## క్రీడా మందిరం

వైశంపాయన్ అను టెలిగ్రాఫ్ గుమాస్తాతోకలిసి స్వామీరావు ఒక అఖాడాను స్థాపించాడు. అందులో యువకులకు శరీరవ్యాయామం నేర్పుతుండేవారు; వారికి దేశభక్తిని ఉద్బోధించేవారు.

అఖాడా అంటే ఏమిటి ? 100 అడుగుల పొడవు, అంతే వెడల్పు గల ఖాళీస్థలం వుండేది. ఆ స్థలంలో వేపచెట్టుక్రింద కుస్తీపట్టడానికి 12 అడుగుల చదరం భూమి మెత్తగా తవ్వబడివుండేది. దానిని ' గోదా ' అని పిలుస్తారు. కొన్ని లాఠీలు, గదలూవుండేవి. ఇవన్నీకలిసి ' క్రీడా మందిర్ ' అని పిలువబడేది.

భావనగరం మహారాజా కృష్ణ కుమార్‌సింగ్‌జీ పట్టాభిషేక వుత్సవంలో అఖాడా యువకులు ఒక వ్యాయామప్రదర్శనంచేశారు. ఉత్సవాలలో వాలంటీర్లుగా పనిచేశారు. అందుకుమెచ్చి దివాన్ శ్రీ ప్రభాశంకరపట్టానీ మోతీబాగ్ తోటలో పెద్దస్థలం క్రీడామందిరానికి గ్రాంటుచేశాడు. స్వామీరావు పౌరులనుండి రూ. 300 లు చందాలు వసూలుచేసి సామాను తెప్పించాడు. నగరంలోని బాలురు, యువకులు అచటికివచ్చి శరీర వ్యాయామం చేసేవారు.

---

# బర్మా యాత్ర

పృథ్వీసింగు రాజమండ్రి జైలులోవుండగా తండ్రి షాదీరామ్‌నుంచి జాబువచ్చింది. దానిలో కొడుకును చూడాలని వుందని వ్రాశాడు. కాని అపుడు పృథీసింగును ఖూనీ కొట్టులలో పెట్టారు; బంధువులను కలుసుకొనే సౌకర్యం రద్దుచేశారు; అందుచే తండ్రికి బర్మానుంచి వచ్చి కొడుకును చూడటానికి అవకాశం దొరకలేదు.

అప్పటినుంచీ ఒకసారి తండ్రినిచూచి అంజలి అర్పించి వద్దామనే కోరిక పృధ్వీసింగుకువుంది. అందుచే బర్మా వెళ్ళిరావాలని నిర్ణయించు కొన్నాడు. మిత్రులవద్ద రూ 200 లు తీసుకొని బయలుదేరాడు.

* * * *

ఒక రాత్రివేళ తండ్రివద్దకువెళ్ళి పాదాభివందనం చేశాడు. యుద్ధ రంగానికి వెడుతున్న కుమారుని ఆశీర్వదించమని అడిగాడు. తండ్రి పుత్రుని కౌగలించుకొని దేశసేవచేయడానికి వెళ్ళ అనుమతి యిచ్చాడు. పృధ్వీసింగ్ తండ్రితో యిలాచెప్పాడు: "నేను దేశంకొరకు శత్రువుతో పోరాడుతూ మరణించితే, ఆ వార్త పత్రికలలో ప్రకటించబడి నీకు తెలుస్తుంది. రోగినై మంచంపై మరణించితే, నా మిత్రులు నీకు తెలియజేస్తారు. ఇలాగే రహస్యంగా దేశసేవచేస్తూంటే, నన్నుగురించి నీ కేమీ తెలియదు." అని చెప్పి శెలవు తీసుకొన్నాడు.

పృధ్వీసింగుకు విదేశాలకు వెళ్ళాలని కోరిక వుంది. బర్మా సరిహద్దును దాటి సయాంగుండా చైనాకు చేరాలని ఒకప్లాను వేశాడు. రంగూన్ బజారులో ఒకపిస్తలు, తూటాలు కొన్నాడు. అడవులగుండా ప్రయాణం చేయునపుడు ఎదురుపడే అడవిజంతువులను భయపెట్టడానికి అది దగ్గర వుంచుకున్నాడు. ప్రధమ చికిత్సకు కావలసిన మందులు కూడ దగ్గర వుంచుకొన్నాడు. ఒక కత్తిని కూడ పదిలపరచాడు.

మోల్మిన్ పట్టణం వదలి బోటులో నదిని దాటాడు. అచటనుంచీ భీకారణ్యం; భీకర మృగాలతో నిండివుంది. అవేవి అతని జోలికి రాలేదు. కాని మలేరియాదోమ పృధ్వీసింగును పడగొట్టింది; చలిజ్వరం రాసాగింది. ఎలాగో ఒక టెలిగ్రాఫ్‌లైన్ కీపర్ ఇంటికి చేరాడు. అపుడు పృధ్వీసింగు ముసల్మాన్ వేషంలో వున్నాడు. ఆ యువకుడు హిందువు. ఎంతో దయతో ఆతిధ్యమిచ్చాడు. తీవ్రమైన జ్వరంలో వున్న పృధ్వీసింగుకు శుశ్రూష చేశాడు. జ్వర తీవ్రతలో పృధ్వీసింగు అనేక విషయాలు వాగాడు. "హిందూ - ముస్లిములం కలిసి దేశవిరోధులను పారదోలుదాం" అన్నాడు.

ఈ మాటలనుబట్టి టెలిగ్రాఫ్‌మనిషి అతడొక దేశభక్తుడని గ్రహించాడు. జ్వరం తగ్గేదాకా పృధ్వీసింగును సాకాడు. ఆ పరిస్థితులలో ఒంటరిగా ప్రయాణం చేయడంలో వున్న ప్రమాదాలను తెలిపాడు. తిరిగివెళ్ళమని నచ్చచెప్పాడు.

పృథ్వీసింగు రంగూన్ తిరిగివెళ్లాడు. కలకత్తా వెళ్ళే స్టీమరుకోసం రేవులో ఎదురుచూస్తున్నాడు. ఇంతలో ఒక సి. ఐ. డి. అతనిని అను మానంతో చూడసాగాడు; వాడు వరుసగా ప్రశ్నలు వేయసాగాడు; పృథ్వీ సింగు ఒక పెద్ద వర్తకుని పేరుచెప్పి, అతడు తనకు హామీయిస్తాడని తెలి పాడు. తనసంగతి తెలుసుకోడానికి ఆ వర్తకుని వద్దకు వాడిని రమ్మన్నాడు. దారిలో ఒక సందులోకి తీసుకువెళ్ళాడు. 50 రూపాయలు వాడి చేతిలోపెట్టి "నీ రోజులు బాగుండాలంటే నన్నింతటితో వదులు" అన్నాడు. వాడు నోరుమెదపకుండా వెళ్ళిపోయాడు.

వెంటనే ప్రక్కవీధిలో వెడుతున్న టాక్సీ (అద్దెకారు)లో పృథ్వీ సింగు యెక్కాడు. రైల్వేస్టేషనువద్ద దిగి రైలు యెక్కాడు. మాండలే పట్టణం చేరాడు. అచటినుండి చింద్విన్ నదిలో బోటుయెక్కి కింటిట్ పట్టణంచేరాడు. అది ఉత్తరబర్మాలో ఆఖరుస్టేషను. ఆచటినుంచి మణి పూర్ పర్వతాలు దాటి అస్సాంద్వారా భారతదేశం చేరాలనుకున్నాడు.

అచటి సత్రంలో 3 గురు మణిపూర్ ప్రయాణీకులు కన్పించారు. వారితోపాటు పృథ్వీసింగు తానూ వస్తానన్నాడు పర్మిట్‌వుంటే అలాగే తీసుకుపోతామన్నారు వారు. పృథ్వీసింగు వారిని స్నేహం చేసుకొన్నాడు. తాను నాన్‌కోఆపరేటర్ (సహాయనిరాకరణవాది) ననీ, అందుచే యూరోపి యన్ ఉద్యోగిని పర్మిట్ (అనుమతి పత్రం) అడుగననీ పృథ్వీసింగు చెప్పాడు. పర్మిట్‌లేకుండా తనను కొండదోవను తీసుకువెళ్ళమని అడి గాడు. వారు కొండదోవను వెళ్ళితే మూడురోజులు యెక్కువ పడుతుం దని చెప్పారు. పృథ్వీసింగు మణిపూర్ చేరేదాకా ముగ్గురకు అయ్యేఖర్చులు తానే పెట్టుకొంటానని వారిచే ఒప్పించాడు.

మరుసటిరోజునే ముగ్గురూ ప్రయాణమయ్యారు. దోవ జారుడుగా వుండి పృథ్వీసింగు అనేకసార్లు పడ్డాడు. అరణ్యంలో పులులు అనేకం కనిపించాయి. ఒక గ్రామ సత్రంలో నిదురించుతుండగా దొంగలువచ్చి చుట్టేశారు. వీరులేచి అరుస్తూ కర్రలతో రక్షించుకొన్నారు. కొంతసేపటికి గ్రామస్థులొచ్చి దొంగలను పారదోలారు.

దారిలో కొండవాగు దాటవలసివచ్చింది. ఎంతో ప్రయాసంమీద దాటారు. కుంభవర్షం కురువసాగింది. అదివరకే వారి బట్టలు తడిసి పోయాయి; అందులో వాన; చలి; వణుకు పుడుతోంది. పృథ్వీసింగుకు మళ్ళీ మలేరియాజ్వరం దాపురించింది. మర్నాడు 10 రూపాయలిచ్చి

పృథ్వీసింగు రోజుప్రయాణానికి కొండగుర్రాన్ని కుదుర్చుకున్నాడు. సాయంకాలానికి మిత్రులకు యెరిగినవారున్న గ్రామంచేరాడు. పర్వతాలు దాటడానికి చివరిగ్రామం అదే. రెండురోజులు పృథ్వీసింగు జ్వరంతో అచట పడివున్నాడు. మూడోరోజు మరల ప్రయాణం. 5 రూపాయలిచ్చి గుర్రం కుదిర్చారు. 40 మైళ్ళు ప్రయాణంచేసి మణిపూర్ చేరారు. ఈవిధంగా యెన్నో ప్రమాదాలు దాటి పృథ్విసింగు పర్మిట్ లేకుండానే భారతదేశం చేరాడు.

మణిపూర్‌లో పృథ్వీసింగు మిత్రుల అతిథ్యంతో విశ్రాంతి తీసుకున్నాడు. ఆరోగ్యం కోలుకోడానికి యెనిమిదిరోజులు పట్టింది. మణిపూర్‌నుంచి అస్సామ్ వెళ్ళడానికి అనుమతిపత్రం కావాలి. అందుకొరకు రెసిడెంటును కలసికోడానికి పృథ్వీసింగుకు ఇష్టంలేదు. వీధులలో తిరుగుతుండగా సర్కసులో పనిచేసేవాడొకడు కన్పించాడు. అతనితో పరిచయం చేసికొన్నాడు. అతనికి 10 రూపాయలిచ్చి ఆ సర్కసుముఠాతోకలసి అస్సాంచేరాడు. అచటనుండి భావనగరానికి ప్రయాణం సులభంగానే గడచిపోయింది.

## మళ్ళీ భావనగరంలో

భావనగరం చేరాక పృథ్వీసింగు ఎప్పటివలెనే క్రీడామందిర కార్యక్రమం సాగించాడు. ఈసారి రాజపుత్ర బోర్డింగ్‌స్కూలులో వ్యాయామ అధ్యాపకుడుగా చేరాడు.

1928 లో కథియవాడ యువజనమహాసభ రాజకోటలో జరుగుతోంది. పండిత జహ్వార్‌లాల్‌నెహ్రూ అధ్యక్షత వహించుతాడు. కథియవార్ యువకులంతా అచటికి వస్తారు. పృథ్వీసింగు అచటికి వెళ్ళాలనుకొన్నాడు. కాని రైలులో వెళ్ళకూడదు. భావనగర్‌నుంచి రాజకోటకు మోటార్‌రోడ్డువుంది. సైకిలుపైన రాత్రి బయలుదేరి ఉదయం సభవేళకు చేరాలనే పట్టుదలతో బయలుదేరాడు. రాత్రివేళ సైకిలుకు లైటులేదు; తెలిసిన దోవకాదు; దగ్గర మంచినీళ్ళులేవు; ఎచట విశ్రాంతి తీసుకోవాలో తెలియదు. బయలుదేరేముందు వాటి ఆలోచనే తట్టలేదు. రాత్రి పదిగంటల

వేళ సైకిలు చీకట్లో వడిగా పరుగెత్తుతోంది. ఒక భయంకరమైన సంఘటన జరిగింది.

అడవిపంది రోడ్డును ఒకవైపునుంచి మరొకవైపుకు దాటుతూంది. ఆకస్మికముగా సైకిలుపై పరుగెత్తుతున్న ఆకారంచూచి బెదిరింది. సైకిలుకు ఎడంగా సైకిలుతోపాటే పరుగెత్తసాగింది. దానిని భయపెట్టి పక్కకు తోలడానికి పృధ్వీసింగు అరచాడు. కేకలువేశాడు. అదివరకే బెదరి వుండుటచేత అవుపాయం పనిచేయలేదు. ఆ మృగం మరింత ప్రాణభీతితో పరుగెత్తుతోంది. పృధ్వీసింగు ప్రాణభీతితో సైకిలు తొక్కుతున్నాడు.

కొంతసేపటికి పంది వెనుకబడిపోయింది. సైకిలు ముందుకు సాగిపోయింది. ప్రమాదం దాటింది. కాని అప్పటికి పృధ్వీసింగు పూర్తిగా అలసిపోయాడు. దాహమవుతోంది. కొంతదూరం వెళ్ళాక ఒకసాధువు గుడిసెలో నీళ్ళు దొరికాయి. కొంచెంసేపు విశ్రాంతి తీసుకొని, మళ్ళీ బయలుదేరాడు.

దోవలో ఒకదజనుసార్లయినా పడివుంటాడు. కాని పెద్దదెబ్బేమీ తగులలేదు. సైకిలు చెడలేదు. 108 మైళ్ళ ప్రయాణం ఒకరాత్రిలో పూర్తిచేయగలిగాడు. ఉదయానికి రాజకోట చేరుకున్నాడు. రైలుబండిలో దిగిన మిత్రులు అపుడే స్టేషనునుంచి బయటికి వస్తున్నారు. వారితో కలిసి స్వామీరావు మహాసభకు వెళ్లాడు.

బహిరంగసభలో శరీర వ్యాయామాన్ని గురించి స్వామీరావు ఉపన్యసించాడు. "యువకులను దుర్మార్గాన్ని ఎదిరించి పోరాడమని మీరు కోరుతున్నారు. యువలకులకు ఒక ఉన్నతాశయం కొరకు పనిచేస్తున్నామనే విశ్వాసముండాలి. యువకులు కష్టించి పనిచేయగల శరీరపుష్టిని సంపాదించాలి. డిసిప్లిన్ (కట్టుబాటు) తో జీవించగల శక్తిని సంపాదించాలి. మన యువకులను వీటితో తరిఫీదు చేయడం వల్ల వారిని స్వరాజ్య పోరాటానికి తయారు చేయగలుగుతాము." అని చెప్పాడు.

ఈ సభలో పాల్గొనడంవల్ల స్వామీరావు కథియవార్ సంస్థానాల లోని యువకులందరికీ పరిచయుడయ్యాడు; తరువాత 'పోరు బందరు'లో సంస్థానప్రజల మహాసభ జరిగింది. దానికి గాంధీమహాత్ముడు అధ్యక్షత వహించాడు. ఆ సభలో స్వామీరావు శరీర వ్యాయామంపై తీర్మానం ప్రతిపాదించాడు.

స్వామీరావు క్రమంగా శరీర వ్యాయామ నిపుణుడుగా కథియవాడ్ అంతటా ప్రసిద్ధికెక్కాడు. అన్ని మూలలకు ఆహ్వానంపై వెళ్ళాడు. ఇంతలో 1930 వ సంవత్సరం వచ్చింది.

## మహాత్ముని దండియాత్ర

దండిలో మహాత్మ గాంధీని అరెస్టు చేశారనేవార్త పృధ్వీసింగును కల్లోలపరచింది. రాంపూర్‌నుంచి సత్యాగ్రహోద్యమానికి వాలంటీర్లను చేర్పించడానికి రమ్మని స్వామీరావుకు టెలిగ్రామ్ వచ్చింది. భావనగర యువకులవద్ద శెలవు తీసికొని దేశభక్తి తరంగాలలో-లీనమైపోవడానికి స్వామీరావు నిశ్చయించుకున్నాడు.

స్వామీరావు సేవను ప్రశంసించుతూ క్రీడామండలి వీడ్కోలు సభ జరిపింది. స్వామీరావు దేశసేవలో నిమగ్నులగుటయే కర్తవ్యమని యువకులకు ఉద్బోధించాడు. "ఎప్పటికైనా సత్య-అహింసల ఆదర్శాన్ని చేరగలుగుతామో లేదో నాకుతెలియదు. కాని నాఆశయం స్వరాజ్యం. దానిని సాధించడానికి నాసర్వస్వం ధారబోయడానికి జంకను" అని చెప్పాడు. వర్తకులను ఉద్దేశించుతూ, "భారతదేశాన్ని సంకెళ్ళలో వుంచడంవల్ల పొందుతున్న లాభాన్ని ఇంగ్లాండు వదలుకోవాలని మీరు అరుస్తున్నారు. కాని విదేశవస్తువుల వ్యాపారంద్వారా పొందే లాభాన్ని వదలుకోడానికి మీరు సిద్ధపడుటలేదు." అని విదేశవస్తువ్యాపారాన్ని నిరసించాడు.

అనేకమంది యువకులు. ప్రజలు స్వామీరావును సాగనంపడానికి స్టేషనుకు వచ్చారు. దాదాపు ఎనిమిదేండ్లు తనకు ఆశ్రయమిచ్చిన భావనగరును వదలడం పృధ్వీసింగుకు కష్టమనిపించింది. కాని మాతృదేశం పిలుపును దేశభక్తులు జవదాటలేరు గదా! భావనగర ప్రజలకు వినమ్రుడై పృధ్వీసింగు శెలవు తీసికొన్నాడు. రైలుబండి పొగలుగ్రక్కుతూ స్టేషను వీడిపోయింది.

---

# అరెస్టు; పలాయనం

రాంపూర్‌లో మిత్రులు డాబుదర్పాలతో ఆహ్వానం ఏర్పాటుచేశారు. కాని ఆహ్వానించడానికి స్టేషనుకు వచ్చిన మిత్రులతోపాటు పోలీసులు కూడ తయారయ్యారు. ట్రెయిను దిగడంతోనే సబ్‌ఇన్‌స్పెక్టరు వచ్చి

అరెస్టుచేశాడు. అకారణంగాచేసిన ఈ అరెస్టుతో ప్రజలు మండిపోయారు. కాని స్వామీరావు వారినిశాంతపరచాడు. వెంటవస్తున్నవారిని రావద్దనినచ్చ చెప్పాడు. తానొకడే సబ్ఇనస్పెక్టరుతో పోలీసుస్టేషనుకు బయలుదేరాడు.

ఇనస్పెక్టరుచేతిలో రివాల్వరువుంది. స్వామీరావు అతని వెంటే నడుస్తున్నాడు; ఆలోచించసాగాడు; జైలుకు పోవడమంటే వెనుకటిగాథ, పుట్టుపూర్వోత్తరాలు బయటికివస్తాయి. కాబట్టి స్వాతంత్ర్యం కొరకు ఇన్స్పెక్టరు చేతులనుండి తప్పించుకోవాలి. ఆలోచించి ఒక యెత్తు వేశాడు. ధైర్యంచేస్తేచాలు! జయం లభించితీరుతుంది!

ఇద్దరూ వీధి చివరకు వచ్చారు. ఇంకా కొన్నిగజాలునడిస్తే మూల మలుపువస్తుంది. స్వామీరావు తనప్లాను నిర్ణయించుకున్నాడు. చురుకుగా ఆచరణలో పెట్టాడు. "సలాం సాహెబ్! మై జాతాహూఁ!" (సలాం! నేను దయచేస్తున్నాను) అంటూ రెండు అంగలలో వీధిమలుపు తిరిగాడు; పరుగెత్తడం లంకించుకున్నాడు. ఇన్స్పెక్టరు నివ్వెరపోయాడు. ఇలాంటి అనుభవం అతనికెప్పుడూ లేకపోవచ్చు. చేతిలోని పక్షి యెగిరిపోతూంటే తెల్లమొహంవేసి చూస్తూ వూరుకున్నాడు. పట్టుకోండని కేక అయినా వేయలేదు.

ఇన్స్పెక్టరువద్ద రివాల్వరువుండగా పరుగెత్తడం ప్రమాదకరమనీ, నూతిలో వురకడంవంటిదనీ అనుకొంటారు. కాని చురుకుగావుంటే రివాల్వరు యెందుకూ పనికిరాదు. ఇన్స్పెక్టరు యెంత త్వరగా గురిపెట్టినా 10 సెకండ్లకు పైగా పడుతుంది. ఈలోగా సర్వీసు రివాల్వరు దెబ్బకు అందనంతదూరం పరుగెత్తవచ్చును.

ఇన్స్పెక్టరు చేతిలోనుంచి తప్పించుకొన్న 10 నిమిషాలలో గాలి దుమ్ము వచ్చింది. పెద్ద వాన కురవసాగింది. ఈవిధంగా ప్రకృతికూడ సాయపడింది. పోలీసువాళ్లు కంకరరోడ్లమీద, కార్లలోను తిరుగుతారు. వానలోనూ, బురదలోనూ వాళ్ళు తిరుగరుకదా! స్వామీరావు వానలో, బురదలో, పొలాలవెంట నడిచిపోతున్నాడు. ఇంక పోలీసులు అతనిని యేమీ చేయలేరుగదా!

కొంతదూరం పోయాక ఒక గ్రామంలో మిత్రుని కలుసుకున్నాడు. అతని సాయంతో గుర్రాలపై ప్రయాణం సాగించాడు. చేలవెంట వానలో పోతూంటే యెవరు పట్టుకోగలుగుతారు? వాన, చీకటి కష్టంకలుగచేసినా, పోలీసు ప్రమాదాన్నుంచి కాపాడుతున్నాయి.

తెల్లవారిన తరువాత గుర్రాలను వదలివేశారు. ఎద్దుబండి కట్టించుకున్నారు. స్వామీరావుపైన బట్టలమూటలు, గడ్డి వేసి మిత్రుడు బండిని తోలించుకుపోయాడు. పట్టణంవద్దకు వచ్చాక అద్దెకారు తీసుకున్నారు. దానిలో కొంతదూరం పోయి రైలుబండి అందుకున్నారు.

పృధ్వీసింగ్ పలాయనం గురించి రెండు కల్పితకథలు కథియవార్‌లో ప్రచారంలోవున్నాయి. (1) ఆ సబ్ఇన్‌స్పెక్టరును తలపై దిమ్మ తిరిగేటట్లుగా కొట్టి పోయాడు. (2) సి. ఐ. డి. ఉద్యోగి ఒకడు స్వామీరావును పట్టుకొంటానని కోరి స్పెషల్‌డ్యూటీ వేయించుకున్నాడట; అనేక సార్లు ఆచూకీ తీయగలిగాడట; ఒకసారి పట్టుకుంటే తలమీద పెద్ద దెబ్బ కొట్టి పారిపోయాడట. దానితో సి. ఐ. డి. మెదడుచెడి పిచ్చెక్కిందట. ఈ రెండుకథలూ ఆధారరహితమైనవే —

సత్యాగ్రహిగావుండి పోలీసుచేతుల్లో నుంచి యిలా పారిపోవడం తప్పని అతని సహచరులైన గాంధీశిష్యులు స్వామీరావును నిరసించారు. ఈ ఖండన తీర్మానం గురించి తెలిసినపుడు పృధ్వీసింగు నవ్వుకొన్నాడు. పోలీసులహడావుడి హెచ్చుగావున్నందున ఇంక కథియవాడ్‌లో వుండటం మంచిదికాదు. అచటినుంచి క్యాంపు ఎత్తివేసి అలహాబాద్‌వైపు వెళ్ళాడు.

## చంద్రశేఖర అజాద్‌తో సంభాషణ

అలహాబాద్‌లోకూడ పోలీసునిఘా చాల హెచ్చుగావుంది. అందుచే కొలదిరోజులుమాత్రమే పృధ్వీసింగ్ అచటవున్నాడు. కాని యీ రోజుల లోనే ఒక ముఖ్యసంఘటన జరిగింది. ఒక యువకుణ్ణి కలుసుకున్నాడు.

అతడే చరిత్ర ప్రసిద్ధుడైన చంద్రశేఖర అజాద్. వారి చర్చలలో వ్యక్తిగత టెర్రరిజం రాజకీయ ఆయుధంగా నిరుపయోగమని అజాద్ అంగీకరించాడు. పృధ్వీసింగును విదేశాలకు వెళ్ళి మార్క్సిస్టు విప్లవ ఎత్తులను నేర్చుకురావాలని కోరాడు; సాయుధ ప్రజావిప్లవం ఒకటే స్వాతంత్ర్య సాధనమని అంగీకరించాడు.

కాని పాపం! అజాద్‌కు నూతన ఆశయాలను అమలుజరుపడానికి అవకాశం లభించలేదు. తరువాత కొద్దికాలానికే అలహాబాద్ పార్కులో వుండగా పోలీసులుచుట్టుముట్టారు. ఆత్మరక్షణార్థం పోరాడవలసివచ్చింది. అజాద్ వీరోచితంగా ఒంటరిగా నిలబడి అనేకమందితో బాహాబాహి పోరాడాడు; వీరమరణం పొందాడు.

## కల్పిత కేసు

భగత్‌సింగ్, రాజగురు, సుఖదేవ్‌లను ఉరిదీసినందుకు అసమ్మతిగా బొంబాయి నగరంలో ఎవరో కాల్పుల ప్రదర్శనం జరిపారు. దానిపై పోలీసులు కొందరిని అరెస్టుచేసి ఒక కేసుబనాయించారు. దీనినే లామింగ్ టన్ రోడ్డు కుట్రకేసు అంటారు. ఈ కేసులో సి. ఐ. డి. వాళ్ళు స్వామీ రావునుకూడా కుక్కారు. అతనినిపట్టుకుంటే రూ. 500/- బహుమతి ఇస్తామని ప్రకటించారు. ఫొటోలు దేశమంతటా ప్రదర్శించారు. ఈ సి.ఐ.డి. లు ఇలా ఏమీ సంబంధంలేని కేసులో ఇరికించడంలో వారిపగటి కలవరింతలు మాత్రమే బయటపడ్డాయి. విచారణలో కేసు కొట్టివేయబడింది.

ఒకసారి రైలుబండిలో ప్రయాణంచేస్తూండగా స్వామీరావు వున్న పెట్టెలో ఒక సి. ఐ. డి. యెక్కాడు. వాడు గుర్తుపట్టాడు. వెంటనే మరి నలుగురిని సాయం తెచ్చుకున్నాడు. తక్కిన ప్రయాణీకులందరిని ఆ పెట్టెలోనుంచి దింపివేశాడు. స్టేషనునుంచి బండి దిలింది. నలుగురు సి. ఐ. డీ. లు కళ్ళు స్వామీరావుపైనే నిగిడ్చి చూస్తున్నారు. స్వామీరావు జేబులో రివాల్వరుంది. ప్రమాదాన్ని కనిపెట్టాడు. చెయ్యి యెల్లపుడూ సిద్ధంగావుంది. పోలీసులకు గుండెలులేవు. మళ్ళీ స్టేషనువచ్చాక అదనంగా సాయం తెచ్చుకొని అరెస్టుచేదామని వేచికూర్చున్నారు.

సిగ్నల్ సమయానికి యివ్వలేదు. రైలుబండి ఆగింది. స్వామీరావు నిర్భయంగా పోలీసువైపు చూచాడు. ఆ చూపుకే వాళ్ళగుండెలు జలదరించాయి. తలుపుతెరిచి ఒక్కడూ దిగిపోతూంటే యెవడూ నోరు మెదపలేదు. మళ్ళీ ట్రైన్ కదిలింది. అచంచల ధైర్యవంతునికి మరల విజయం లభించింది.

తరువాత పృధ్వీసింగు 72 మైళ్ళు నడచి తన గమ్యస్థానంచేరాడు. అచట మిత్రుని ఆతిధ్యంలో విశ్రాంతి తీసికున్నాడు. ఈ సంఘటన తరువాత పృధ్వీసింగుకు ఒక విషయం తేలిపోయింది. స్వామీరావు పేరు, రూపం చాలామందికి తెలిసిపోయాయి. అందుచే స్వామీరావు ఇంక బహిర్గంగంగా ప్రజలలో పనిచేసే అవకాశంలేదు. విదేశాలకు వెళ్ళాలనేకోరిక మరింత బలపడసాగింది.

1931 లో కాంగ్రెసు మహాసభ కరాచీలో జరుగుతోంది. అచటికి వెళ్ళాలని పృధ్వీసింగ్ నిర్ణయించుకున్నాడు. కాని ఎలా వెళ్ళేది?

# సన్యాసివేషం

సాధువేషం ధరించి ప్రయాణం చేయడంకంటే వేరుమార్గం పృధ్వీ సింగుకు కన్పించలేదు. సాధువులను సాధారణంగా ఎవరూ అనుమా నించరు. అందుచే సి. ఐ. డీల ప్రమాదంవుండదు. పృధ్వీసింగు కాషాయ వస్త్రాలు ధరించి కాలినడకను బయలుదేరాడు. మంచి ఆరోగ్యం - చక్కని ఆకర్షవంతమైన రూపం - కాషాయ దుస్తులు. ఇంకేమి కావాలి ప్రజల గౌరవాన్ని పొందడానికి!

పృధ్వీసింగు తన ప్రయాణాన్ని ఆరావలీ పర్వతాలగుండా రాజ పుటానా పుణ్యక్షేత్రాలను దర్శించుకొంటూ సాగించాడు. ఆబూపర్వతం ఎక్కాడు; అచటి గురుషికార్‌ను కలసికొన్నాడు. గుజరాతీలకు పుణ్య తీర్థమైన 'అంబాజీమాత' అనే చోటికి వెళ్ళాడు. తరువాత రాణా ప్రతాప్ సింగు వీరకృత్యాలతో ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన హల్దీఘాటును చూడాలని నిశ్చయించుకున్నాడు.

పృధ్వీసింగు ఆ ప్రాంతమంతా కలయదిరిగాడు. చివరకు హల్దీ ఘాటు చేరుకున్నాడు. అచట భూమి పసుపుపచ్చగా వుంది. అందుకే దానికి ఆ పేరు వచ్చింది. ప్రతాపుని గుఱ్ఱం 'చేటక్' శిలావిగ్రహం అచటవుంది. రాణాప్రతాపునికి చిహ్నంగా ఏదైనా నిర్మించనందుకు పృధ్వీ సింగు విచారపడ్డాడు.

సాధువేషంలో వుండగా పృధ్వీసింగుకు అనేకమంది సాధువులు, సన్యాసులు, సిద్ధులతో సంబంధం ఏర్పడింది. వాళ్ళలో చాలమంది నీచులు, గంజాయి - నల్లమందు వగైరా దురభ్యాసాలకు అలవాటు పడ్డవాళ్ళు. సోమరిపోతులు, ప్రజలను దోచుకునే మోసగాళ్ళు అని తేలింది.

రాజపుటానా ఎడారులను దాటి ఎట్టకేలకు పృధ్వీసింగు కరాచీ చేరాడు. అచట ఒక దేవాలయ మహంతి ఆతిధ్యం స్వీకరించాడు. మరు నాడు మహంతివద్ద శెలవు తీసికోడానికి వెళ్ళాడు. అతనిగదిలో ఒక ఘోరమైన దృశ్యం చూశాడు. ఎవరో అమాయక బాలికను ఆ మహంతి

వేషధారి తన కామానికి బలియిస్తున్నాడు. పృధ్వీసింగుకు అసహ్యం వేసింది.

అంతటితో సన్యాసి దుస్తులను విసర్జించాడు. సామాన్య పౌరుని వలే బట్టలుధరించి కాంగ్రెసు మహాసభకు వచ్చిన మహాజనంలో కలిసి పోయాడు.

అచట ప్రముఖ విప్లవకారులలో ఒకడు అయిన సర్దార్ గురుముఖ సింగును కలిసికొన్నాడు. వారి చర్చలలో సర్దార్ భగత్‌సింగు మొదలగు వారుకూడ, తమ అంతిమ దినాలలో టెర్రరిస్టుమార్గాలను విప్లవకారులు అనుసరించరాదనే నిర్ణయానికి వచ్చారని తెలిసింది. మార్క్సిస్టు విప్లవ ఎత్తులను తెలుసుకోడానికి సోవియట్ భూమికి వెళ్ళాలని గురుముఖ్‌సింగు కూడ కోరుతున్నాడు. ఈ మిత్రునితో సంభాషణ రష్యాకు వెళ్ళాలనే పృధ్వీసింగు కోరికను మరింత బలపరిచింది. ద్విగుణీకృతోత్సాహంతో ప్రయత్నాలు చేయసాగాడు.



## నాలుగవ భాగం

# ప్రపంచ యాత్ర

భారతదేశంవదలి విదేశాలకు వెళ్ళాలంటే అనేక చిక్కులున్నాయి. అందులోను రహస్యంగా ప్రయాణం చేయాలిసిన విప్లవకారులసంగతి వేరే చెప్పాలా ? సరిహద్దులకు కాపలావుంటుంది; సి. ఐ. డి. శాఖవాళ్లు ప్రయాణీకు లందరిని సోదాచేస్తారు. అందుచే అందరూవెళ్ళే రహదారి మార్గాలనువెళ్ళడం సాధ్యపడదు. కీకారణ్యాలను, పర్వతాలను కాలినడకను దాటి విప్లవకారులు ప్రయాణం చేయవలసి వుంటుంది.

పృధ్వీసింగు పర్వతమార్గాలను బయలుదేరాడు. సరిహద్దు కాపలావాళ్ళ కంటబడకుండా భారతదేశ సరిహద్దులను దాటాడు. నాలుగురోజులు నడిచాడు. పాదాలు బొబ్బలుయెక్కాయి. ఎట్టకేలకు హిమాలయ పర్వతాలలో నివసించే మసూద్ తెగనాయకుని కలిసికొన్నాడు. అతనిపేరు 'పాష్‌గుల్'. అతనికి భారతదేశ రాజకీయాలన్నీ తెలుసును; విజ్ఞానవంతుడు. కాబూలు చేరడానికి సాయంచేయమని పృధ్వీసింగు అతనిని కోరాడు. అతడు దారిచూపడానికి ఒకరిని సాయమిచ్చి పంపాడు.

---

# ఆఫ్ఘను అనుభవాలు

దారిచూపేవాడు పృధ్వీసింగును 'ధక్కా' అను ప్రదేశంవరకు సాగనంపాడు. అచటినుండి పృధ్వీసింగు తనంతటతానేప్లానువేసుకోవాలి. బస్సుయెక్కి ఆఫ్ఘన్ స్థానం తూర్పుభాగంలో ముఖ్యపట్టణమైన 'జల్లాబాద్'కు చేరాడు. సూటిగావెళ్ళి రాష్ట్రగవర్నరుసు కలిసికొన్నాడు. అతడు అరెస్టుజేసి పొలిటికల్ డిపార్టుమెంటుకు అప్పగించాడు. వారు స్టేటుమెంటు పుచ్చుకోవాలని చాలా అవస్థపెట్టారు. కాని ఫలితంలేకపోయింది.

గవర్నరు ప్రశ్నలకు జవాబుగా తాను ముహజరిన్ అనీ, పేరు మహమ్మదాలీ అనీ పృధ్వీసింగు చెప్పుకున్నాడు. ముస్లింరాజు పాలనక్రింద

వున్న ఆఫ్ఘనిస్థానంలో నివసించడానికి వచ్చినట్లుగా తెలియజేశాడు. చివరకు గవర్నరు అతనిని కాబూలు పంపమని ఆర్డరువేశాడు. ఒక సామానులారీలో యెక్కి పృథ్వీసింగు కాబూలుచేరాడు.

కాబూలులో అనేకమంది భారత విప్లవకారులు నివసించుతున్నారు. కొంతమంది ముస్లిం సామ్రాజ్యం స్థాపించాలని వెళ్ళిన ముస్లిములు, కొందరు టెర్రరిష్టులు. కొందరు సాయుధ తిరుగుబాటుకు ప్లానులు వేస్తున్న విప్లవకారులు, కొందరు కమ్యూనిష్టులు. ఈ విధంగా అన్ని పంథాలకు చెందిన భారత విప్లవకారులకు కాబూలు కేంద్రమని చెప్పాలి. వీరితోపాటు అన్నిరకాల విప్లవమార్గాలను బోధించుతూ, విప్లవకారులలో తగవులుపెడుతూ, వారి రహస్యాలను కనుగొని ప్రభుత్వానికి రిపోర్టుచేసే సి. ఐ. డీ. లు వున్నారు.

అచటినుండి బయలుదేరి పృధ్వీసింగు ఒక ముస్లిం యువకునితో కలిసి గజ్నీ పట్టణం దర్శించాడు. అది గజ్నీమహమ్మద్‌కు ముఖ్య పట్టణంగా వుండేది. ప్రాచీన చిహ్నాలు యింకా అనేకం వున్నాయి. అచటినుంచి బస్సులో కాందహార్ వెళ్ళారు. అచట బస్సుమారి సోవియట్ సరిహద్దునవున్న హీరట్ పట్టణానికి చేరాలి.

దోవలో ఇంజనుచెడి యెంతో ఆలస్యమైంది. నది దాటవలసి వచ్చింది. పృధ్వీసింగు ప్రయాణీకుల సాయంతో బస్సును నది రెండవ వైపుకు యీడ్చాడు. కాబూలునుండి బయలుదేరిన 20 రోజులకు పృధ్వీసింగ్, ముస్లిం యువకుడూ హీరట్ పట్టణం చేరారు.

అచటి గవర్నరు క్రూరుడు. పృధ్వీసింగును, అమిత్రుని కూడ అనుమానంపై అరెస్టు చేశాడు; జైలులోపెట్టాడు. ఆ ముస్లిం యువకునికి ఆ పట్టణంలో పలుకుబడిగల బంధువులున్నారు. వారు అతనికి మాత్రం జామీనుపై విడుదలఆర్డరు తేగలిగారు. ఆర్డరుచూపించితే చదువురాని కాపలావాడు ముస్లిం యువకునితోపాటు పృధ్వీసింగును కూడ వదలివేశాడు. అదృష్టవశాత్తు బయటపడిన పృధ్వీసింగు తన మిత్రునికి 100 రూ॥ లిచ్చి పంపించివేశాడు. కాలినడకనే సోవియట్ భూమివైపు బయలుదేరాడు.

వెన్నెలరాత్రులు. దారి డొంకలు లేని ప్రాంతం. ఎటు చూచినా కొండలు. ఉత్తర దిక్కుగా ప్రయాణం సాగించాడు. దగ్గర డబ్బువుంది. కాని ఆహారంలేదు. ఎదురుపడిన ఫకీరులను బిచ్చమడిగితే వాళ్ల రొట్టె ముక్కలిచ్చారు. కాని అవి రాళ్ళల్లేవున్నాయి. నమలడానికి అలవికాలేదు.

దారిలో ఒకచోట అనాగరిక తెగ ప్రజల గూడెంలోకి వెళ్ళాడు. అచట పిల్లలకు కొన్ని రాగిడబ్బులిచ్చాడు. అంతటితో ప్రజలు అతని చుట్టూ మూగారు. ఒకరిభాష ఒకరికి తెలియదు. పృధ్వీసింగు సంజ్ఞలతో తన ఆకలిని తెలియజేసాడు. వారు పాలు, రొట్టె, వెన్న తింటానికి యిచ్చారు. పుండుపడిన పృధ్వీసింగు పాదాలను చూచి విచారపడ్డారు. వారిలో ఒకడు ప్రయాణానికి తన గుర్రాన్ని బదులు యిస్తానన్నాడు. పృధ్వీసింగు ఆదిమ ప్రజలుచూపిన ఆదరానికి కృతజ్ఞత తెలిపాడు. వారి వద్ద శెలవు తీసుకొని కాలినడకనే మరల ప్రయాణం సాగించాడు.

దారిలో ఒక ఒంటె యజమానినుండి తప్పించుకొని పారిపోయి వస్తూంది. యజమాని వెనుకనుంచి అరుస్తున్నాడు. పృధ్వీసింగు ఒంటెను తాడుపట్టుకొని ఆపి యజమానికి అప్పగించాడు. యీ విధంగా వారికి పరిచయం కలిగింది. పృధ్వీసింగు తాను కుష్కవైపు వెడుతున్నానని చెప్పుకున్నాడు. యజమాని ఒంటెపై తనతోపాటు ఎక్కి ప్రయాణం చేయమని ఆహ్వానించాడు. పృధ్వీసింగ్ మృదువుగా నిరాకరించాడు. సోవియట్—ఆఫ్ఘన్ సరిహద్దు విషయమై వివరాలనుఅడిగి తెలుసుకున్నాడు. ప్రక్కనే దగ్గరగావున్న నది రెండు దేశాలమధ్యసరిహద్దు అని తెలిసింది. అనుమతి లేకుండానది దాటితే ఏవైపు కాపలావాళ్ళయినా కాల్చవచ్చును.

పృధ్వీసింగు ఒంటె యజమానివద్ద శెలవుపుచ్చుకొన్నాడు. పొదల చాటునే నదియొడ్డుకు చేరాడు. నదిలో నీళ్ల లోతుగాలేవు. ఒక్క పరుగులో అవతల ఒడ్డుకు వెళ్ళి పడ్డాడు. ఒకగొప్ప జీవితాశయం కొరకు పోరాటంలో పాల్గొననివారు, జయంవల్ల కలిగే సంతోషాన్ని అర్థంచేసికోలేరు. తాను సోవియట్ యూనియన్‌లో, కార్మిక - కర్షక రాజ్యంలో అడుగుపెట్టాననే భావమే పృధ్వీసింగుకు ఎంతో ఉత్సాహమిచ్చింది. ఒక కొండపైకి ఎక్కి అపుడే ఉదయించుతున్న సూర్యుణ్ణి చూచాడు. అది దోపిడీ లేని దేశం; సంకెళ్లులేని స్వేచ్ఛాజీవులైన ప్రజలరాజ్యం. 1931 జులై 28 తేదీన అచటికి చేరాడు. "ఆ రోజును ఎన్నటికీ మరువజాలను. సగర్వంగా జ్ఞాపకముంచుకుంటా"నని పృధ్వీసింగు తన ఆత్మకథలో చెప్పుకున్నాడు.

# సోవియట్ భూమిలో

పొద్దుపొడుపు ఎండలో ఆ కొండపైన పృధ్వీసింగు రెండుగంటలు విశ్రాంతి తీసుకున్నాడు. అలసటవల్ల శరీరమంతా పచ్చిముద్ద అయిపోయినది; కాళ్లు బిర్రబిగిసిపోయి పాదాలు భూమిమీద ఆనించడమే కష్టమనిపించింది. నెమ్మదిగా చేతులతో పాదాలు ఒత్తుకున్నాడు. లేచి కష్టమ్స్ ఆఫీసువైపు వెళ్ళాడు.

అచట కనబడిన రక్షకభటుని తనను ఆఫీసరువద్దకు తీసుకువెళ్ళమని అడిగాడు. వెంటనే ఏమి పనిమీదవచ్చారు? అనే ప్రశ్న వచ్చింది. "భారతదేశ విప్లవకారుడను. ముఖ్యమైన పనివుంది. బాధ్యతగల ఉద్యోగి వద్దకు తీసుకువెళ్ళండి" అని పృధ్వీసింగు పర్ష్యన్‌భాషలోచెప్పాడు రక్షకభటునికి యీ భాష తెలియదు. కాని యేదో అవసరమైన పనివుందని గ్రహించాడు; ఆఫీసరువద్దకు తీసుకువెళ్ళాడు. ఉద్యోగి రష్యన్‌భాషలో ప్రశ్నించాడు. పృధ్వీసింగు ఇంగ్లీషులో సమాధానమిచ్చాడు. తరువాత పర్ష్యన్‌భాష తెలిసిన దుబాసీని రప్పించారు. పృధ్వీసింగు పర్ష్యన్‌భాషలో చెబుతూంటే దుబాసీ రష్యన్‌భాషలోకి అనువాదం జేయసాగాడు.

ఈలోగా వేడినీళ్ళ బొక్కెన తెప్పించి పృధ్వీసింగు కాళ్లు దానిలో వుంచారు. అతడు తనగాధ చెబుతున్నాడు. నర్సువచ్చి బొబ్బలెక్కి, తోళ్ళు వూడిపోయిన పాదాలకు శుభ్రంగా కట్టుగట్టింది. ఆహారంపెట్టి ఒక గదిచూపి దానిలో విశ్రాంతి తీసుకోమన్నారు.

తరునాత స్పెషల్ బ్రాంచి పోలీసులువచ్చి పృధ్వీసింగును పరీక్షించారు. ఆ రిపబ్లిక్ ముఖ్యపట్టణమైన టాష్కెంటు నగరానికి తీసుకువెళ్ళారు. అచట జైలులో వుంచారు. అమెరికాలోవున్న సోవియట్ రాయబారిద్వారా పృధ్వీసింగుచరిత్రను తెలుసుకొన్నారు. గదర్‌పార్టీ పృధ్వీసింగు చెప్పిన గాధనంతటిని నిజమని ఖాయపరచింది. జైలునుంచి పృధ్వీసింగు విడుదల అయ్యాడు. భారత స్వాతంత్ర్యం కోరినందున మాతృదేశంలో పౌరసత్వ హక్కులు గోల్పోయిన ఆ విప్లవకారునికి నాటినుండీ సోవియట్ భూమిలో పౌరహక్కులన్నీ లభించాయి. ఆ దేశ ప్రజలవలెనే పృధ్వీసింగు స్వేచ్ఛగా జీవించవచ్చును. తన శక్తి, విజ్ఞానం, కృషిద్వారా

యేట్టి పదవి అయినా పృథ్వీసింగుకు కరతలామలకం; అభివృద్ధి చెందడా
నికి సంపూర్ణ అవకాశాలు ఇవ్వబడినాయి.

## మాస్కోకు ప్రయాణం

తరువాత పృథ్వీసింగు సోవియట్ యూనియన్ ముఖ్యపట్టణమైన 'మాస్కో' కు బయలు దేరాడు. మాస్కో నగరమంటే ప్రపంచ విప్లవ కారులందరికి ఆశాజ్యోతి. ప్రపంచ కార్మిక - కర్షకులకు పెట్టనికోటయై వారి భవిష్యత్తును, విశ్వమానవకళ్యాణాన్ని నిర్ణయించే మహానగరమది.

రైలుబండిలో పృథ్వీసింగు ప్రయాణీకులందరినీ ఆకర్షించాడు. సోవియట్ పౌరులు బానిసదేశాల ప్రజల స్థితిని, రంగు జాతుల స్థితిని తెలిసికోడానికి యెంతో ఆతురత చూపారు. విప్లవానికి పూర్వం తమవలే బానిసత్వం అనుభవించుతున్న భారత ప్రజలయెడ వారికెంతో సానుభూతి వుంది. కమ్యూనిస్టుపార్టీ వారికి ఒక విషయం తేటతెల్లంజేసింది - అన్ని జాతుల ప్రజలు ఏ రంగువారైనాసరే, స్వేచ్ఛాస్వాతంత్ర్యాలకు అర్హులు. ఒకజాతిని మరొకజాతి దోచుకొనే విధానానికి వారు వ్యతిరేకులు.

రైలుబండిలో పృథ్వీసింగును భారతదేశ ప్రతినిధిగా సోవియట్ పౌరులు గౌరవించారు. బాలసంఘం బాలురు శ్రద్ధతీసికొని పృథ్వీసింగుకు తమ భాష నేర్పారు. వారు అతని గట్టికండరాలను చూచి కష్టజీవి అని గౌరవించారు. బాలికలు "కండ్లు నల్లగా ఎంత చక్కగా వున్నాయ్" అని విస్తుపోయారు. నాలుగురోజుల ప్రయాణంలోనూ ప్రజలు పృథ్వీ సింగును ఆప్యాయతతో చూచారు. ఐదవరోజు మాస్కో చేరాడు.

సోవియట్ రాజ్యాంగ శాసనం ప్రకారం ప్రపంచ విప్లవకారులకు సోవియట్ పౌరహక్కులు లభ్యమవుతాయి. వారు అచట నివసించి సోవి యట్ పౌరునివలెనే పనిజేసి ఫలితం అనుభవించవచ్చును. పృథ్వీసింగు సోవియట్ భూమిలో 1931 జులై 29 తేదీనుంచి 1933 జూన్ 19 వరకు నివసించాడు. సోవియట్ జీవితం అనుభవించాడు. కాని అవన్నీ తన స్వీయచరిత్రలో పృథ్వీసింగు తెలుపలేదు. ఏమంటే, విప్లవనీతిని అను సరించి అలా చెప్పకూడదు; సమయం వచ్చినపుడు అవి ప్రకటించుతా నన్నాడు.

పృథ్వీసింగుకు సోవియట్ భూమిలో ఎన్నో అవకాశాలున్నాయి. సౌఖ్యప్రదమైనజీవితం అనుభవించవచ్చు. కాని తన మాతృదేశం, భారత

దేశం బానిసత్వంలోవుంది. భారతస్వాతంత్ర్య సమస్య అలాగేవుంది. ఎల్లప్పుడూ అది పృధ్వీసింగు కండ్ల ఎదుట తాండవమాడుతూంది. తన ప్రజలలో పనిచేయాలి; స్వాతంత్ర్యం సంపాదించాలి; ప్రజారాజ్యం స్థాపించాలి; భారత ప్రజలుకూడ సోవియట్ ప్రజలవలే సౌఖ్యాలుపొందాలని పృధ్వీసింగు కోరుతున్నాడు. అందుచే భారతదేశానికి తిరిగి రావాలని నిర్ణయించుకున్నాడు. కామ్రేడ్ గురుముఖ్‌సింగుతో కలిసి మాతృదేశానికి బయలుదేరాడు.

---

# ఆఫ్ఘన్ దేశంలో అనుభవాలు

అపాయకరమైన పనులు, ఉద్రేకమైన చేతలంటే ధైర్యంగల యువకులకెంతో సంతసం. కాని మనవారు పిన్నలుకాదు; జీవితంలో రెండవ దశ గడచిపోయిన పెద్దలు. వారి మనస్సును అన్నిటికంటే ఒకే ఒక ఆలోచన వేధించుతూంది. మాతృదేశంచేరి తమ అనుభవాలను ఇదివరకే భారతదేశ ప్రజల విముక్తికొరకు కృషిచేయుచున్నవారికి నివేదించాలని, వారికి తోడుపడాలని. ఈ ఆలోచనే కామ్రేడ్స్ పృధ్వీసింగు, గురుముఖ్ సింగుల ప్రయాణానికి ప్రోత్సాహమిచ్చింది.

వారిద్దరు ఇండియా ప్రభుత్వంచే శిక్షింపబడినవారు. బహిరంగ మార్గాలద్వారా భారతదేశానికి రావడానికి వీలులేదు. అందుచే యెవరూ అడుగిడని ఆప్ఘన్‌దేశపు పర్వతప్రాంతాలలో ప్రయాణం సాగించారు. మంచుతో కప్పబడిన హిందూకుష్ పర్వత శిఖరాలమధ్యనుండి దారిచేసికొని వచ్చుటే వారికి మిగిలినమార్గం.

కామ్రేడ్ గురుముఖ్‌సింగు కొంతకాలం ఆప్ఘన్‌దేశంలో నివసించాడు. అందుచే దేశాన్ని బాగా యెరుగును. కాని రాజకీయ ప్రవాసికి ఇది అట్టే ఉపయోగపడదు. పైగా గుర్తింపబడుతానేమోనని భయం వుంటుంది. వారివద్ద ఆప్ఘన్‌స్థానంయొక్క మ్యాపు చక్కనిది వుంది. దానిసాయంతో కామ్రేడ్స్ ఆప్ఘన్‌దేశపు తూర్పు ప్రాంతాలలోనుంచి ప్రయాణపు ప్లాను వేసికొన్నారు. ఏమంటే ఆ ప్రాంతాలలో గురుముఖ్ సింగును యెరిగినవారు లేరు. దారిలో వారితో 'హుకుంసింగు' అను మిత్రుడు కలిశాడు. అతడుకూడ రహస్యంగా భారతదేశం రావాలని కోరుతున్నాడు.

అతిధులను మ్రింగివేసే హిందూకుష్‌పర్వతాలలో తిరిగినపుడు అనేక భీకర ఘటనలు జరిగాయి. ' ఆక్స్యాస్ ' లేక ' అమూదర్యా ' నది సోవియట్ యూనియన్‌కు, ఆఫ్ఘన్‌దేశానికి సరిహద్దుగా ప్రవహించుతోంది. అది వడిదుడుకుగా గర్జిస్తూ ప్రవహించే సెలయేరు. ఆ నది ఒడ్డు చేరునప్పటికి యెలా దాటాలో తోచలేదు. అయినా నురుగులు గ్రక్కుతున్న అలలవైపు చూస్తూంటే - తల్లి సముద్రాన్ని చేరడానికి పరుగిడుతున్న ఆ ప్రవాహపు గర్జనలు వింటూంటే - రాతికొండలు చీల్చుకుపోతూన్న ఆనదిని చూస్తుంటే వారి హృదయాలలో మాతృదేశం చేరాలనే కోర్కె మరింత రగిలింది. ఆరాత్రే ముగ్గురూ రెండుగుర్రాలతో నదినిదాటారు.

ముగ్గురు మనుష్యులు - రెండు గుర్రాలు రోజులతరబడి కొండలలో ప్రయాణం. అందుచే వారు అలసిపోయారు. కాని విశ్రాంతికి అవకాశం లేదు. ఒక ఇరుకైన లోయగుండా ప్రయాణంచేస్తున్నారు. రెండువైపులా యెత్తైన పర్వతాలు. తప్పించుకోడానికి మార్గంలేదు. ఎదురుగా వస్తున్న పోలీసులచేతులో పడ్డారు.

ముఖాలే విదేశీయులనితెలుపుతున్నాయి. దగ్గర ప్యాసుపోర్టులులేవు. ఇంకేమికావాలి ? పోలీసులు అరెస్టుచేసి ఖానాబాద్ గవర్నరువద్దకు పంపారు అచట హుకుంసింగును యెరిగినమిత్రుడు బాదల్‌షాన్ కనిపించాడు. అతడు జామీనిచ్చి హుకుంసింగును విడిపించాడు. హుకుంసింగు తక్కిన ఇద్దరికి జామీనిచ్చాడు. 20 రోజులలో కాబూలులో విదేశాంగ మంత్రివద్ద హాజరయ్యే షరతుపై విడుదల చేశారు.

పృధ్వీసింగు, గురుముఖ్‌సింగులు 20 రోజులలో కాబూలువెళ్ళి విదేశాంగమంత్రితో తమసంగతి చెప్పుకోవాలి. లేనిచో తిరిగి అరెస్టు చేస్తారు. వారిద్దరు గుర్రాలపైన కాబూలు అయిదురోజులలో చేరగలిగారు. అచట గుర్రాలను వదలివేశారు. ఇద్దరు దారి చూపువారిని సాయంతీసి కొన్నారు. భారత సరిహద్దువైపుకు ఎవరూ నడువని చుట్టుమార్గాన బయలు దేరారు. వరుసగా 48 గంటలు విశ్రాంతిలేకుండా ప్రయాణం చేశారు. రాత్రిపూట అంతా నిద్రించుతుండగా కాపలావారిని తప్పించుకున్నారు.

అదృష్టం ఎపుడు బద్దలవుతుందో ఎవరికి తెలుసు. అందుబాటుకు వచ్చినటులేవుండి అదృశ్యమవుతుంది. దేనికోసం రాత్రింబవళ్లు ప్రయాణం చేసి యీడ్చుకొచ్చారో ఆ మాతృదేశం దరిదాపుకువచ్చారు. ఇంకో రెండు గంటలప్రయాణం. అంతే, భారతభూమిలో ప్రవేశించుతారు. కాని

అకస్మాత్తుగా సరిహద్దు పోలీసులు మన దేశభక్తులను అరెస్టుజేశారు. వారివద్దనున్న సామానంతా సిపాయిలు దొంగిలించారు. 60 మైళ్ళ దూరాన వున్న ఉద్యోగి వద్దకు నడిపించారు. అచట బరువైన సంకెళ్లువేసి ఖయిదుచేశారు.

ఆ జయిల్లో ఖాళీలేదు. మనవారిని బలవంతాన లోనికి తోశారు. ధరించిన దుస్తులుతప్ప మరేమీలేవు. జైలు ఒక చీకటికొంప. దయగల ముస్లిము ఒకరు కనికరించి కొంతజాగాయిచ్చాడు. అచట మనవారు చతికిల బడ్డారు. లేనిచో ఆ బరువైనసంకెళ్ళతో రాత్రల్లా నిలబడివుండాలసివచ్చేది.

అచట ఖైదీలకు అధికారులు తిండిబెట్టరు. స్వంతడబ్బుతో కొను క్కోవాలి. లేదా పోలీసు ఎస్కార్టుతో బజారుకువెళ్ళి బిచ్చమెత్తాలి. గురుముఖ్‌సింగును ఎవరైనా గుర్తిస్తారేమోనని బయటికి వెళ్ళలేదు. పృధ్వీసింగు ఎవరితోనైనా పరిచయం చేసికోవచ్చునని వెళ్ళాడు. కొందరు పవిత్రులైన మహమ్మదీయులు దయతో ఆహారం పెట్టారు. ఇలా మూడు రోజులు గడిచాయి. నాలుగవరోజున కామ్రేడ్స్ తామెవరో తెలుపుతూ స్టేట్‌మెంటు యిచ్చారు. వెంటనే టెలిగ్రాములపై టెలిగ్రాములునడిచాయి. ఆ రోజునే కోటలోనికి మార్చివేశారు.

40 రోజుల తరువాత 1933 సెప్టెంబరులో ప్రధానమంత్రి ఉత్తరవు వచ్చింది. మామాఖేల్‌నుంచి మనవారిని కాబూలు సెంట్రల్ జెయిలుకు మార్చారు. సెంట్రలుజైలుకు వెళ్లటతోడనే కామ్రేడ్ గురుముఖ్‌సింగు "ప్రాణాలతో పూడ్చిపెడుతున్నారు" అన్నాడు. ఆ జైలులో యిచ్చిన ఆదరణ నిజంగా ప్రాణాలతో బయటపడతారనే ఆశ లేకుండా చేసింది. వీరిని చూడగానే జైలు సూపరిండెంటు ఉద్యోగులందరిని పిలచి యిలా చెప్పాడు. "ఏ ఖయిదీ అయినా వీరితో కలిస్తే కొరడాదెబ్బల శిక్ష! వీరు యితరులతో మాట్లాడితే దేహశుద్ధి జరుగుతుంది" అని ప్రకటించాడు.

## బ్రిటిషు రాయబారిపై కాల్పు

తర్వాత నాలుగు రోజులకు బ్రిటిష్ సామ్రాజ్యపు ప్రతిష్ఠకు తీరని దెబ్బ తగిలింది. ఒక ఆఫ్ఘన్ యువకుడు బ్రిటిషు రాయబారి కార్యాలయం పైన తుపాకి పేల్చాడు. తన స్టేటుమెంటులో బ్రిటిషువారిపైన, బ్రిటిషు సామ్రాజ్యపు ఏజెంటగు నాదిర్‌ఖాన్ పైన ద్వేషం వెళ్ళగ్రక్కాడు.

బ్రిటిషు ప్రభుత్వం వెంటనే కామ్రేడ్స్‌కు, యీకాల్పులకు ముడి పెట్టింది. ఆఫ్ఘన్ ప్రభుత్వంపై ఒత్తిడి తే మొదలుపెట్టారు. బ్రిటిషువారు సూచించినట్టుల ఖయిదీలను బ్రిటిషు అధికారులకు అప్పగించ నిరాకరించింది. దానికి బదులు జయిల్లో క్రమంగా హతమార్చడానికి అంగీకరించింది. ఆఫ్ఘన్ ప్రభుత్వం తన మాటప్రకారం నడిచింది. అప్పటి నుండి వైద్యసహాయం ఇవ్వలేదు. మిత్రులతో ఉత్తరప్రత్యుత్తరాలకు అనుమతిలేదు. రాజుగారికి, మంత్రికి లేక సూపరిండెంటుకు అప్పీలు చేసికొనే హక్కు నిరాకరించబడింది. జైలు సూపరిండెంటు బ్రిటీషు అధికారులకు యిలా వ్రాశాడు - "వీరిని వాయుప్రసారంగాని, పక్షి రెపరెపల ధ్వనిగాని చేరనిచోట జాగ్రత్త చేశా"నని తెలియజేశాడు. దీనివల్ల భారత విప్లవ కారులకు ఆఫ్ఘన్‌దేశంలో దయ చూపబడదని రుజువయింది. భారత విప్లవకారులిద్దరు కాబూలు సెంట్రల్ జైలులో కృంగి కృశించిపోతున్నారనే వార్త ప్రపంచానికి తెలియకుండా చేయాలని ప్రయత్నించారు.

---

# ఉపవాసం

ఆఫ్ఘన్ జయిలు జీవితాన్ని గురించి వ్రాస్తే ఒక గ్రంథమవుతుంది. నిర్బంధవిధానం, నిరాదరణవల్ల కామ్రేడ్స్ ఆరోగ్యం చెడిపోయింది. జెయిల్లో ప్రవేశించినపుడు సాధ్యమైనంత హెచ్చుకాలం జీవించడానికి ప్రయత్నించాలనీ, బయటి ప్రపంచానికి తమ నిర్బంధవార్త అందజేయాలని నిశ్చయించుకొన్నారు. కాని సహింపరాని నిరాదరణ ఓర్పును ఎగురకొట్టింది. ఉపవాసం ప్రారంభించారు.

ఉపవాసం జైలు అధికారులను ఏమీ కదల్చలేదు. డాక్టరుగాని, ఉద్యోగిగాని నిరశనవ్రతుల వద్దకు రానేలేదు. క్రమంగా కాపలా కాసేవారిలో మనవారియెడల సానుభూతి ఏర్పడింది. ఒకరోజున గార్డు యిలా అన్నాడు : మీ జీవితాన్ని హరించాలని ప్రభుత్వం అతినీచమైన పద్ధతులు అవలంబించుతూంది. మీ తెలివితక్కువ ఉపవాసం మరణాన్ని చేరువకు తెస్తూ ప్రభుత్వానికి సాయపడుతూంది."

జీవించాలనీ, పోరాటం సాగించాలనీ మానవుని కోర్కె చాల బలవత్తరమయింది. దాని ప్రోత్సాహంవలన మనవాళ్ళు మరణానికి దగ్గర

దారి అయిన వుపవాసం వదలివేశారు. అసలే చలికాలం. పరుంటానికి పక్కలేదు. కప్పుకోడానికి ఏమీలేదు. అందులో ఉపవాసం! ఆరోగ్యం పాడైంది, మృత్యువు ముఖాలపై తాండవమాడే ఎముకలగూళ్లుగా తయారయ్యారు. ఒక గ్లాసెడు వెచ్చనినీళ్ళయినా దొరకవు. ఆహారం కాలీకాలని పఠాన్‌రొట్టె. మంచుతో సమానంగా వుండే చన్నీళ్లు. ఈ తిండితో బ్రతకటం ఎంతకష్టం!

---

# ఉరికంబాలు

బ్రిటిష్ రాయబారి కార్యాలయంపై కాల్పులను, నాదిర్‌ఖాన్ జాతీయ శక్తులను అణచివేయడానికి సాకుగా తీసికున్నాడు. ఒకరోజు ఉదయాన జైలు ఉద్యోగులు హడావుడిగా వున్నారు. సైనికులు పోగయ్యారు. పాపం ఖైదీలు ఆ ఇద్దరు హిందువులకు (అనగా పృధ్వీసింగు - గురుముఖ్ సింగులకు) అంతిమకాలం సమీపించిందనుకున్నారు. కాని ఆ తయ్యారీ మనవారికొరకు కాదు.

శుభ్రమైన దుస్తులు ధరించిన ఐదుగురను జైలులోకి తెచ్చారు ప్రజల మేలుకోరిన అమానుల్లా రాజు మంత్రులు వారు. ఉరిస్తంభాలవైపు జూచి సంగతి గ్రహించారు. శాంతంగా, నిశ్చింతగా నీళ్ళు తెప్పించుకొని ఆఖరి ప్రార్థనలుచేశారు. వరుసగా వారి నైదుగురను అధికారులు ఉరితీశారు. తరువాత శవాలపై వున్న దుస్తులను ఉద్యోగులుదొంగిలించారు.

తన మార్గానికి అడ్డువస్తారనుకొన్నవారి నందరిని నాదిర్‌ఖాన్ హతమార్చాడు. ఇంక తన సింహాసనం సురక్షితమనుకున్నాడు. కాని ఆ ద్రోహి యెంతోకాలం బ్రతకలేదు. యువక విప్లవకారుని గుండుదెబ్బకు గురిఅయ్యాడు.

అధికారులు ఆ యువకుని ఎన్నో చిత్రవధలు చేశారు. ముక్కు - చెవులు కోశారు. ఆఖరుకు బహిరంగంగా ఉరితీశారు. ఈ ఘోరాలన్నిటిని ఆ వీరయువకుడు గంభీరంగా సహించాడు. అట్టి యువకుని కన్నజాతి సామ్రాజ్యవాదపు ఉరులనుండి తప్పక విముక్తి చెందుతుంది.

పై ఘటన టెర్రరిస్టు ఎత్తులు ప్రభుత్వ విధానంలో మార్పును గొనిరాజాలవని రుజువుచేసే అనేక ఉదాహరణలలో ఒకటి. ఒకటి వ్యక్తి

ఎంత దుర్మార్గుడైనా అతన్ని చంపినంతమాత్రాన ఆవ్యక్తి ప్రాతినిధ్యం వహించే విధానం నాశనంకాదు. ఆ యువకత్యాగి వీరకార్యం వెనక దేశంలో నిర్మాణశక్తిలేదు. ప్రజల తోడ్పాటు, మిలిటరీసహాయంలేదు.

పరిపాలనావిధానం మార్చాలంటే విప్లవకారులు ప్రజాసామాన్యం దగ్గరకు వెళ్ళాలి ప్రస్తుత విధానంలోని చెడుగులు తెలియజేసి వారికి చైతన్యం కలుగజేయాలి. ఈపనులు చేయడానికి ఉక్కునరాలు కావాలి. పరిపూర్ణమైన రాజకీయవిజ్ఞానం సంపాదించాలి. ప్రస్తుత రాజకీయ, ఆర్థిక శక్తులను అంచనావేయాలి. పరిస్థితులను అర్థంచేసుకొని తగిన కార్యక్రమం నిర్ణయించుకోగలిగిన తెలివితేటలు కావాలి.

---

# మృత్యువుతో పోరాటం

ధర్మామీటరు మైనస్ 24 డిగ్రీలు చూపుతూంది. అనగా మంచు గడ్డకంటే మించిన చలి. కిటికీలలోనుంచి, తలుపుసందుల్లోనుంచి వేసే గాలి శరీరాలను కరుస్తూంది. కామ్రేడ్స్ బురదతో తలుపుసందులు పూడ్చి వేశారు. చలిగాలి లోనికి రాకుండాచేసి ఎంతో సంతృప్తి పడ్డారు.

ఆఫ్ఘన్ ప్రభుత్వం కామ్రేడ్సును ఉరితీయకుండానే చల్లగా చంప దలచుకుంది. ప్రపంచంతో వీరికేమీ సంబంధం లేకుండా చేసింది. ఇది సమానులమధ్య పోరాటంగాదు. ఒకవైపున - ఏమీ ఆధారంలేని, సంకెళ్లు వేసిన, కాపలాలోవున్న ఇద్దరు ఖయిదీలు. రెండోవైపున రెండు బలమైన ప్రభుత్వాలు. ప్రపంచంతో వారికేమీ సంబంధంలేకుండా చేశాయి. కాని విప్లవకారులు చేయలేని పనిలేదు. మనవారు తమ అనుభవాన్ని వినియోగించారు. తమ నిర్బంధాన్ని గురించి ప్రపంచానికి తెలియజేయగలిగారు.

ఒకరోజు సాయంకాలం జైలు సూపరిండెంటు జైలు ఉద్యోగులందరిని పిలిచాడు. "హిందువుల సంతకంతో ఇండియాకు, లండనుకు ఉత్తరం ఎలావెళ్ళింది?" అని మండిపడ్డాడు. హిందువులకు (పృధ్వీసింగ్ - గురుముఖ్‌సింగ్‌లకు) వ్రాసే సామానులేదు; ఎవరూ వారిదగ్గరకే వెళ్ళటలేదు. ఉత్తరం ఎలావ్రాశారు? "వీళ్లు గారడీవాళ్లు. సైతాన్ బిడ్డలు. ఏమైనా చేయగలరు!" అని కొందరు జవాబు చెప్పారు.

•••oOo•••

# సోవియట్ సహాయం

ఈ సంగతి తెలియగానే సానుభూతిపరులు ఆందోళన జేశారు. కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ పలుకుబడి చాలా ఉపయోగపడింది. సక్రమ పద్ధతిని సాగించిన ఆందోళన ఫలించింది. సోవియట్ ప్రభుత్వం భారత విప్లవకారులు తన పౌరులని చెప్పి వారి విడుదలను కోరింది. 1934 జులై 4 వ తేదీ ఉదయాన్నే జైలు అధికారులు కామ్రేడ్సును నిద్రనుండి లేపారు. సోవియట్ టపావిమానం మిమ్ము తీసుకుపోడానికి వచ్చిందని తెలిపారు. సజీవంగా పూడ్చిపెట్టబడిన మన విప్లవకారులు బ్రతికి బయట పడ్డారు. సోవియట్ విమానంలో కాలుబెట్టారు. మరల సోవియట్ ప్రజా రాజ్యం రక్షణక్రిందకు చేరారు.

1933 జూన్ 19 వ తేదీన పృధ్వీసింగు, గురుముఖ్‌సింగులు మాతృదేశం వెళ్ళడానికి ఆఫ్ఘన్‌భూమిలో అడుగుబెట్టారు. మరల సోవియట్ విమానం 1934 జులై 6 వ తేదీన ఎముకలప్రోగులను టాష్కెంటు నగరానికి చేర్చింది. ఆ కామ్రేడ్స్ ఆరోగ్యం కోలుకోడానికి ఆరునెలలు పట్టింది అంతర్జాతీయ కమ్యూనిస్టుపార్టీ వారి ఆరోగ్యంకొరకు శ్రద్ధ వహించింది. ఎంతో డబ్బు ఖర్చుపెట్టింది.

1934 లో సోవియట్ యూనియన్ ప్రజలు ప్రధమ పంచవర్ష ప్రణాళికను జయప్రదంగా నెరవేర్చారు. రెండవ పంచవర్ష ప్రణాళికను అమలు జరుపుతున్నారు. ఈ ప్లానులద్వారా సోవియట్ ప్రభుత్వం దేశ పరిశ్రమలను యెంతో అభివృద్ధిచేసింది. సమిష్టి వ్యవసాయ క్షేత్రాలను నిర్మించి, ట్రాక్టరు వగైరా యంత్రాలను వ్యవసాయంలో ప్రవేశపెట్టి రైతుల ఆదాయాన్ని వృద్ధిచేసింది. ప్రపంచమంతా ఆర్థిక దుర్భిక్షంతోనూ, నిరుద్యోగంతోనూ నకనకలాడుతున్న రోజులవి. సోవియట్ యూనియన్ నిరుద్యోగాన్ని నిర్మూలించింది. ప్రజల జీవిత పరిమాణాన్ని వృద్ధిచేసింది. సోవియట్ ప్రజలు కలకలలాడుతున్నారు. పెట్టుబడిదారీ దేశాలకు - సోవియట్ భూమికి స్పష్టంగా కాన్పించుతున్న యీ తేడా ప్రపంచ ప్రజలను మేల్కొల్పింది. క్రమంగా అభివృద్ధిని కోరేవారంతా సోవియట్ యూనియన్‌వైపు ఆశాదృష్టులతో చూడసాగారు.

## ఐదవ భాగం

# మాతృదేశానికి రాక

ఆఫ్ఘన్‌జైళ్ళలో వుండగా తీసిన పృధ్వీసింగు ఫొటోలను సి. ఐ. డి. లు అన్నిచోట్లకు పంపారు. అతనిని భారతదేశంలో అడుగిడనివ్వకుండుటకు జాగ్రత్తలు తీసుకొన్నారు. ఒకవేళ వస్తే అరెస్టుచేసి జైలులో పూడ్చిపెట్టడానికి సంసిద్ధంగా కూర్చున్నారు.

కాని విప్లవకారుల పట్టుదలను సడలించగలశక్తి ఎవరికీలేదు. ఒకసారి పని సాధించాలనే నిశ్చయానికివస్తే ఎన్ని ఆటంకాలున్నా అతడు వెనుకంజవేయడు. నేర్పరితనంతో పనిచేసి ఆటంకాలను తప్పించుకొని గమ్యస్థానం చేరడానికి అకుంఠితదీక్షతో పనిజేస్తాడు.

పృధ్వీసింగు యూరపుమీదుగా ఓడప్రయాణంచేసి భారతదేశానికి చేరాలని నిశ్చయించుకున్నాడు. అతనికి ప్యాసుపోర్టులేదు. ఎలాగో కష్టపడి ఒక దొంగ ప్యాసుపోర్టు సంపాదించాడు. దానిపైన ఒక యూరోపియన్ ఉద్యోగి రష్యారేవులో ఎక్కినట్లుగా నమోదు చేశాడు. ఇది మరొకచిక్కు. ఏమంటే రష్యానుండి ప్రయాణం చేస్తున్నాడంటే అంతా అనుమానంగా పరీక్షిస్తారు. ఇన్ని చిక్కులనుదాటి భారతదేశానికి రావాలి. సి. ఐ. డి. లు రేవులలో సిద్ధంగా కూర్చున్నారు. కాని వీరందరి కళ్ళలో దుమ్ముకొట్టి ఒకరేవులో పృధ్వీసింగు దిగాడు.

వెంటనే ఆ రేవుపట్టణం వదలి పృధ్వీసింగు కొంతదూరం వెళ్ళాడు. ఒక సి. ఐ. డి. అతనిని అనుమానించాడు. వెంటబడసాగాడు. పొలాలలోనికి రానిచ్చి పృధ్వీసింగు వాడిని నిలవేశాడు. తనవెంట రావద్దనీ, వెళ్ళిపొమ్మనీ చెప్పాడు. కాని వాడు వినిపించుకోలేదు. ముష్టియుద్ధం ప్రారంభమయింది. పృధ్వీసింగు వానిని ఎత్తి నేలకేసికొట్టాడు. ఈ దెబ్బతో వాడు బేజారెత్తిపోయాడు. లేచి పారిపోవాలని చూస్తున్నాడు. పృధ్వీసింగు వాని కాళ్లుచేతులు కట్టివేసి వెళ్ళిపోదామని పట్టుకున్నాడు. వాడు పృధ్వీసింగు వేలును గట్టిగా కరచాడు. మోకాలితో గుద్ది పృధ్వీసింగ్ తనవేలు వదలించుకున్నాడు. పట్టుకొన్న ధోవతిని వదలివేసి మొండి మొలతో సి. ఐ. డి. 'బ్రతుకు జీవుడా!' అని పిక్కబలం చూపాడు.

చుట్టుపట్ల పొలాలలో రైతులు పనిచేసుకొంటున్నారు. సి. ఐ. డీ. ఎంత అరచినా వారు వాడి సహాయానికి రాలేదు. వినోదం చూస్తూ వూరు కున్నారు.

పృధ్వీసింగు తనదారిని ప్రయాణం సాగించాడు. పగలు చేలలో దాగుకొనేవాడు, రాత్రిళ్ళు ప్రయాణం సాగించాడు. బూట్లతో అలా 100 మైళ్లు నడిచాడు. నాలుగు రోజులు ప్రయాణం చేసి ఒకమిత్రుని యింటికి చేరాడు. అచటనుండి కొంతదూరం గుర్రపుబండిలోను, కొంతదూరం మోటారులోనూ ప్రయాణంచేసి తన గమ్యస్థానం చేరాడు.

ఇంతకాలం కాలిబూట్లు తీయనేలేదు. పుండ్లు పడ్డాయి. బలవంతాన తీయవలసివచ్చింది. తోలుతోగూడ ఊడివచ్చాయి. పాదాలకు, చేతివేలుకు కట్టుకట్టుకొని పూర్తి విశ్రాంతి తీసుకున్నాడు. 12 గంటలు వరుసగా నిదురపోయాడు. తరువాత ఒకటికిలేచి మరల నిదురబోయాడు. ఐదు రోజులకు అలసట తీరింది. కాని పాదాలు యింకా భూమిమీద మోప నీయడంలేదు. 7 రోజుల అనంతరం కాళ్ళు క్రింద పెట్టగలిగాడు. తరువాత మరల మిత్రుల సాయంతో ప్రయాణం సాగించాడు.

# సహచరులకోసం అన్వేషణ

రష్యాలో వుండగా పృధ్వీసింగు మిత్రులతో యిలా అనేవాడు. "భారతదేశానికి చేరనివ్వండి. విప్లవశక్తులను ఎలా ఆర్గనైజు చేస్తానో!" కాని యిచ్చటికి వచ్చాక పని అంత సులభంగా కన్పించలేదు. భారతదేశం అనే మహాసముద్రంలో తానొక నీటిబొట్టు అనిపించింది. యూరపులో వుండగా పృధ్వీసింగు అనేకమంది మిత్రులను కలసికొన్నాడు. వారు భారతదేశంలో రహస్యజీవితం కష్టమనీ, చేరిన ఆరునెలల్లోనే పట్టుబడ తావనీ జోస్యం చెప్పేవారు. పృధ్వీసింగు వారి నిరుత్సాహపు మాటలను లెక్కచేయలేదు.

పృధ్వీసింగు భారతదేశంలో అనేక ప్రమాదాలను యెదుర్కోవలసి వుంది. సురక్షితంగా వుండాలంటే డబ్బుకావాలి. ఎంతైనా డబ్బు ఖర్చు పెట్టే మిత్రులు చాలమంది వున్నారు. విప్లవకారులతో సంబంధం పెట్టుకో కుండా 5 నెలలు దేశమంతా తిరిగాడు. ఇలా తిరగడం సులభమే.

ఏమంటే సోదర విప్లవకారులతో కలసి ఉద్యమంలో పనిచేయకపోతే పోలీసులు ఆచూకి తీయలేరు. తిరుగవద్దనీ, తాము సురక్షితంగా కాపాడుతామని మిత్రులనేవారు. కాని స్వాతంత్ర్యకాంక్ష యెలా పూరుకోనిస్తుంది?

పృధ్వీసింగు దేశమంతా తిరిగి పరిస్థితులను అవగాహన చేసికొన్నాడు. తరువాత విప్లవోద్యమంతో సంబంధం పెట్టుకొని పనిచేయసాగాడు. పృధ్వీసింగుకు కాంగ్రెసులోచేరి బహిరంగంగా పనిచేయడానికి అవకాశంలేదు. టెర్రరిస్టుల పాలసీ నిరుపయోగం కాబట్టి దానిలో చేరలేదు. కాంగ్రెసు సోషలిస్టుపార్టీ పెద్ద ధ్వనిచేస్తోంది. ఆ రోజులలో దానికి జవ్హార్‌లాల్‌నెహ్రూ అండవుంది. కాని అది ప్రపంచ ప్రజలకు ఆశాజ్యోతియైన సోవియట్ యూనియన్‌పై దుష్ప్రచారంచేస్తోంది. కమ్యూనిస్టుపార్టీపైన నిందలువేయడమే పనిగా పెట్టుకొంది. అందుచే పృధ్వీసింగు కాంగ్రెస్ సోషలిస్టుపార్టీలో చేరలేదు.

కమ్యూనిస్టు నాయకులతో సంబంధం పెట్టుకున్నాడు. పార్టీలోచేరి పనిచేయసాగాడు. ఈ విధంగా భారత జాతీయ పోరాటంలోని సత్సాంప్రదాయాలన్నిటిని కొనివచ్చిన స్వాతంత్ర్య సైనికుడగు పృధ్వీసింగును కమ్యూనిస్టుపార్టీ తనలో లీనంచేసుకుంది.

---

## రహస్య జీవితం

పృధ్వీసింగ్‌ను పట్టించినవారికి రు 500 బహుమానంఇస్తామని ప్రభుత్వం ప్రకటించింది. అన్నిచోట్ల అతనిఫొటోలనుప్రకటించారు. వేలకొలది మంది పృధ్వీసింగ్‌ను యెరుగుదురు. కాని ఎవరూ ఆనీచానికి పాల్పడలేదు.

పృధ్వీసింగ్ మారుపేరుతో కొన్నిరోజులు చౌకీదారుగా పనిచేశాడు. ఆ మహానగరంలో అనేకమంది అతనిని ఎరుగుదురు. ఐనా ఆ వృత్తిలో పృధ్వీసింగు నిర్భయంగా తిరిగాడు. ఏమంటే యెవరూ అతడావృత్తిలో వుంటాడనుకోరు. అందుచే సందేహమేరాదు. ఎరిగినవారుసైతం అతని దగ్గరగా వెళ్లుతూకూడ గుర్తించేవారు కాదు.

తరువాత ఒక కంపెనీకి సేల్స్‌మన్‌గానూ, ట్రావెలింగ్ ఏజెంటుగానూ, పనిచేశాడు. దేశమంతా తిరిగాడు. బెంగుళూరులో ఒక యువకునితోకలిసి 6 నెలలు వున్నాడు. ఆ యువకుడు చిన్నతనంలో స్వామీరావు

శిష్యుడు. కాని 6 నెలలు కలిసివున్నా ఎవరూ ఆ సంగతి యెత్తలేదు. ఐనప్పటికి ఇద్దరి హృదయాలకు ఆ విషయం తెలుసు. చూచారా! గాంభీర్యమంటే అలావుండాలి.

ఇంకోవూళ్లో పృధ్వీసింగ్ హోటల్లో నివసించుతున్నాడు. ఒక శిష్యుడు అతనినిగుర్తించి పాదాలకు నమస్కరించాడు. పృధ్వీసింగ్ ఎరుగనట్లుగా ఊరుకున్నాడు. తరువాత పేకాటలో అతడు పృధ్వీసింగ్‌ను గురూజీ అని సంబోధించసాగాడు. ఎంతలో గురువును సంపాదించావని పృధీసింగ్ వెక్కిరించాడు. కాని రాత్రిపూట కలిసికొని కారణం అడిగితే స్వామీరావు శిష్యుడని తేలింది. జాగ్రత్తలుచెప్పి తగిన కట్టుదిట్టాలు చేసుకున్నాడు.

ఇంకో పెద్దవాడు స్వామీరావుని అనుమానించాడు. అతడు పూర్వం సి. ఐ. డి. ఉద్యోగి. ఇపుడు సేల్సు (అమ్మకం) ఏజెంటు. అపుడు ఏమి చెయ్యాలి? పృధ్వీసింగ్ వెంటనే రాజీనామా యిచ్చి, పోస్టుద్వారానే లెక్కలు అప్పచెప్పాలి. ఆలోచించాడు. వాడు పూర్వనైజాన్ని మార్చుకొన్నాడని గ్రహించి, ఇపుడు దగాచేయడని నిశ్చయించుకొన్నాడు. దీనిలో ప్రమాదంవుంది. కాని పృధ్వీసింగు అంచనా నిజమని తేలింది. వాడు ద్రోహం చేయలేదు.

రహస్యజీవితంలోని సంఘటనలు ఇలాంటివి ఎన్నైనాచెప్పవచ్చు. పృధ్వీసింగు అనేక కంపెనీల శాంపిలు వస్తువులు దగ్గర వుంచుకొని ప్రయాణం చేసేవాడు. సి. ఐ. డి. లు దొంగవ్యాపారం చేసేవాడు (Smuggler) అనుకొని వెంటబడ్డారు. దగ్గరనే ఎముకలు తొలిగితే బాగుచేసే డాక్టరు యిల్లువుంది. పృధ్వీసింగు ఆ వైద్యశాలలోకి వెళ్ళాడు. తోమించసాగాడు. పోలీసువాళ్ళు బయట కాపలాకాశారు. పృధ్వీసింగు తనకు నొప్పి తగ్గలేదనీ, నడువలేననీ డాక్టరుతోచెప్పి అద్దెకారు తెప్పించుకొన్నాడు. సి. ఐ. డి. లు చూస్తుండగానే కారుయెక్కి వెళ్ళిపోయాడు. వాళ్ళకు సమయానికి కారులేదు. కాబట్టి పృధ్వీసింగును వెంబడించలేకపోయారు. తెల్లమొగంవేసి చూస్తూ నిలబడిపోయారు.

ఈ విధంగా ప్రజల సాయంతోను, తనబుద్ధిని వినియోగించుకొని పృధ్వీసింగు 16 యేండ్లు రహస్య జీవితం గడుపగలిగాడు. పోలీసుల కండ్లలో దుమ్ముకొట్టి సురక్షితంగా తిరగగలిగాడు. ట్రావెలింగు ఏజెంటుగా పనిజేసి యజమానుల విశ్వాసం సంపాదించాడు. కొన్నిరోజులు మానేజరుగా పనిచేశాడు. పోలీసు ఉద్యోగులతో వ్యవహరించాడు. ఒక

సారి కంపెనీ వర్కుషాపులో పనిజేసే పంజాబీ యువకుని పోలీసులు అనుమానించి బాధించసాగారు. విచారణకువస్తే మానేజరుగావున్న పృధ్వీ సింగ్ మంచి ప్రవర్తన గలవాడని రికమెండు చేశాడు. దానిపై పోలీసులు ఆ యువకుని వదలివేశారు. పృధ్వీసింగు ఏ వృత్తిలోవుంటే ఆ పనిని సరిగా నిర్వర్తించేవాడు. అందుచే యెవరికీ అనుమానం తట్టేదికాదు. సురక్షితంగా వుండగలిగాడు.

ఒకసారి యజమాని ఎగ్జిబిషన్‌లో (ప్రదర్శనంలో) సేల్స్‌మన్‌గా పనిచేయమన్నాడు. ఆ ప్రదర్శనం నెలరోజులుంటుంది. లక్షలకొలదీ ప్రజలు వస్తారు. వస్తువులను ప్రదర్శించాలి. మాట్లాడాలి; వాదించాలి. ఎంతప్రమాదం రహస్యజీవితం గడిపేవారికి? అందుచే పృధ్వీసింగు ఆ పనికి రాజీనామా యిచ్చివేశాడు.

## పట్టుబడ్డాడు

1938 వ సంవత్సరం ఏడురాష్ట్రాలలో కాంగ్రెసుమంత్రులు పరిపాలన చేస్తున్నారు. ప్రజలకు కొంతవరకు పౌరసత్వహక్కులు లభ్యమయ్యాయి. కమ్యూనిస్టుపార్టీపై నిషేధం పోకపోయినప్పటికి బహిరంగంగా పనిజేసే అవకాశాలు లభ్యమయ్యాయి. పార్టీతరపున బొంబాయినుంచి నేషనల్ ఫ్రంటు పత్రిక వెలువడుతూంది.

పృధ్వీసింగుకు క్రమంగా రహస్యజీవితంపై విరక్తిపుట్టింది. బయటికి రావాలి; బహిరంగంగా పనిచేయాలని ఆవేదన బయలుదేరింది. దానితో పూర్వమున్న పట్టుదల, ధైర్యం సడలింది.

ఎన్నోకష్టాలను అనుభవించాడు. శరీరంలో శక్తివుంది. 5 అడుగుల 8 అంగుళాల పొడవు; 158 పౌన్లు బరువున్నాడు. 45 యేండ్లు వయస్సు దాటినా 60 మైళ్ళు ఒకబిగువున నడువగలడు. మైళ్ళకొలది పరుగెత్త గలడు. కాని రహస్యంగా జీవించడంకంటే దేశసేవ చేయడానికి బహిరంగ జీవితం అవుసరమని తోచింది. గాంధీమహాత్మునివద్దకు వెళ్ళాడు. ఆయనకు తన చరిత్రంతా వివేదించాడు. గాంధీజీ అంటే పృధ్వీసింగుకు ఎంతో గౌరవముంది. మహాత్ముడు ప్రభుత్వానికి పట్టుబడటమే అహింసావాది లక్షణమనీ, పృధ్వీసింగుకు తన సలహా ఆదేననీ చెప్పాడు.

1938 సంవత్సరం మే 21 తేదీన మహాత్మాజీ పత్రికలకు స్టేటు మెంటు యిచ్చాడు. 16 సంవత్సరాలు పోలీసుల కండ్లలో దుమ్ముకొట్టి రహస్యజీవితం గడపిన పృధ్వీసింగ్ తనంతట తానే పోలీసులకు పట్టు బడ్డాడు. భారత విప్లవచరిత్రలో యిలా లొంగిపోవడం ఒక నూతనఘటన ! అంతా చకితులయ్యారు !

## మరల జైలు

బొంబాయిలో పోలీసు సూపరిండెంటు మే 21 వ తేదీన పృధ్వీ సింగును అరెస్టుచేశాడు. కారులో తీసుకువెళ్ళి తానా జెయిల్లో వుంచాడు. జూన్ 18 వ తేదీన బర్మానుంచి సోదరులువచ్చి పృధ్వీసింగును కలసి కొన్నారు. స్వంత తమ్ముడుగాక సవతితమ్ములు మరిద్దరున్నారనీ పృధ్వీ సింగుకు అపుడే తెలిసింది. తండ్రి రాలేదేమని పృధ్వీసింగు సందేహిం చుతూ అడిగాడు. తమ్ముల కన్నీళ్ళే దానికి సమాధానమిచ్చాయి. తండ్రి గతించిపోయి కొన్ని యేండ్లయిందని తెలిసింది.

జులై 10 వ తేదీన పృధ్వీసింగును పంజాబు జెయిలుకు మార్చారు. జైలులో అధికారులు ప్రసిద్ధిచెందిన తమ ఖైదీని గౌరవంగా చూచారు. అచటవుండగా లాహోరు రైతుయాత్ర ఖైదీలు అనేకమంది జైలుకు వచ్చారు. వారికి పృధ్వీసింగు చదువు నేర్పేవాడు.

గాంధీజీ పృధ్వీసింగు విడుదల విషయమై ప్రభుత్వంతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపాడు. చివరకు పంజాబు ప్రభుత్వం ఒక షరతుపై విడుదలచేయడానికి అంగీకరించింది. ముందుగా ప్రభుత్వం అంగీకరించితే గాని పంజాబులో కాలు పెట్టకూడదు. 1939 సంవత్సరం సెప్టెంబరు 23 వ తేదీన పృధ్వీసింగును సేవాగ్రామంలోని గాంధీజీ ఆశ్రమంలోనికి తీసుకొని వచ్చి విడుదల చేశారు. ఆ రాత్రి స్వతంత్రుడుగా నిర్మలాకాశంక్రింద ఆశ్ర మంలో నిద్రించాడు. ఆలోచనలు పరిపరివిధాలుగా పరుగెత్తాయి.

అచట గాంధీజీ శిష్యుడుగా వారి పర్యవేక్షణక్రింద పృధ్వీసింగు కొంతకాలం వున్నాడు. గాంధీజీ అహింసా సిద్ధాంతాలను అర్థం చేసుకో డానికి, ఆచరణలో పెట్టడానికి కృషిచేశాడు. భక్తివిశ్వాసాలతో గాంధీజీని అనుసరించాడు.

# మహాత్మునితో విభేదం

ఇంతలో ప్రపంచమంతా యుద్ధం ఆవరించింది. ఒకవైపున నాజీ రాక్షసులు. రెండోవైపున జపాన్ దుండగీడులు ప్రపంచాన్నంతటిని జయించి ప్రపంచ ప్రజలందరిని బానిసలుగా చేసుకోడానికి విజృంభించు తున్నారు. యూరపునంతను జయించిన హిట్లరు 1941 జూన్ 22 తేదీన ప్రపంచ ప్రజలకు ఆశాజ్యోతిఅయిన సోవియట్ యూనియన్‌పై బడ్డాడు. 1941 డిసెంబరు 7 వ తేదీన జపాన్, అమెరికా - బ్రిటనులమీద యుద్ధం ప్రకటించింది. వరుసగా ఇండోచైనాను, పసిఫిక్ దీవులను, తూర్పు ఇండియా దీవులను, మలయాను, బర్మాను ఆక్రమించింది. భారతదేశపు సరిహద్దుకువచ్చి సమయంకొరకు వేచివుంది.

తన జీవితాన్నంతటిని భారత స్వాతంత్ర్యంకొరకు అర్పించిన పృథ్వీసింగు వెంటనే తన కర్తవ్యాన్ని గ్రహించాడు. ఫాసిస్టు దుండగీడు లను ఎదిరించడంపైనే ప్రపంచ ప్రజలందరి స్వాతంత్ర్యం ఆధారపడి వుందని గుర్తించాడు. ఏ స్వాతంత్ర్య సంపాదనకొరకు బ్రిటీషుసామ్రాజ్య వాదులతో పెనుగులాడుతున్నామో ఆ స్వాతంత్రోద్యమ రక్షణకే జపాను దురాక్రమణదారులను దేశభక్తులు ఎదిరించాలన్నాడు.

తన అభిప్రాయాలను వెంటనే పృథ్వీసింగు గాంధీజీకి తెలియ జేశాడు. గాంధీజీ జాతీయప్రభుత్వం యిచ్చేవరకు యుద్ధకృషిలో పాల్గొన జాలమనే దృక్పథం తీసుకున్నాడు. గురు శిష్యులమధ్య అభిప్రాయ భేదా లొచ్చాయి. అంతటినుండి పృథ్వీసింగు సేవాగ్రామం వదలివెళ్ళాడు. బొంబాయి నగరం వెళ్ళిపోయాడు.

అచట వ్యాయామమండలి స్థాపించి యువకులకు శరీరవ్యాయామం, దేశభక్తి బోధించుతున్నాడు. జపాను శత్రువులనుండి మాతృదేశాన్ని రక్షించుకోడం దేశభక్తులందరి కర్తవ్యమని స్పష్టపరుస్తున్నాడు. దేశరక్ష ణలో పాల్గొనుటద్వారానే భారత స్వాతంత్రోద్యమ ఆశయాలు నెరవేరు తాయి. దేశరక్షణకొరకు అన్ని మతాలవారు, జాతులవారుకలసి జాతీయై క్యతను నిర్మించుకోవాలి. ప్రధాన రాజకీయసంస్థలైన కాంగ్రెసు - ముస్లిం లీగులమధ్య ఐకమత్యం నిర్మించాలి. భారతదేశంలో నివసించే పఠానీలు,

పంజాబీలు, సింధీయులు, గుజరాతీలు, బెంగాలీలు, అస్సామీ ప్రజలు ఓఢ్రులు, ఆంధ్రులు, ద్రవిడులు, కర్ణాటకులు, కేరళులు వగైరా జాతులన్నిటికి స్వయం నిర్ణయాధికార హక్కువుంది. ముఖ్యంగా ముస్లిం జాతుల స్వయం నిర్ణయాధికారాన్ని ప్రకటించి ముస్లిం ప్రజలలోవున్న సందేహాలను కాంగ్రెసు తొలగించాలి. ఈ విధంగా ప్రజాఐక్యతను నిర్మించుటద్వారానే బ్రిటీషు ప్రభుత్వాన్నుంచి జాతీయ ప్రభుత్వాన్ని గుంజుకోగల్గుతాము. యుద్ధంలో ఫాసిస్టులను ఓడించి, నిర్మించే స్వేచ్ఛా ప్రపంచంలో భారతదేశం సమానహోదా పొందగల్గుతుంది. ఈ భావాలను పృధ్వీసింగ్ ప్రచారం చేస్తున్నాడు.

---

# అరెస్టు - విడుదల

1942 ఆగస్టులో కాంగ్రెసునాయకులను ఆకస్మికంగా ప్రభుత్వం అరెస్టుచేసింది. తమనాయకుల అరెస్టువార్త ప్రజలనురెచ్చగొట్టింది. ఈ అవకాశం వినియోగించుకొని కాంగ్రెసు సోషలిస్టులు, ఫార్వర్డుబ్లాకు ముఠాలు దేశమంతా విధ్వంసకచర్యలను ప్రోత్సహించాయి. అరాజకం ప్రబలింది.

ఇది సాకుగా తీసుకొని ప్రభుత్వం తీవ్రమైన నిర్బంధవిధానం ప్రయోగించింది. విచక్షణలేకుండా అరెస్టులు సాగాయి. దేశభక్తులు అనేకమంది ఎట్టి నేరారోపణకూడ లేకుండానే జైళ్ళకు పంపబడ్డారు. అలాంటి వారిలో పృధ్వీసింగ్‌కూడా వున్నాడు.

పృధ్వీసింగు తనను అకారణంగా జైలుకంపినందుకు ప్రభుత్వంతో లోపలనుండి పోరాటం సాగించాడు. తాను ఏ భారతస్వాతంత్ర్యం కొరకు తన జీవితాన్నంతను ధారపోశాడో అందుకొరకే జపాన్ శత్రువులను ఎదిరించాలని కోరుతున్నానని తెలియజేశాడు. జపాన్ దురాక్రమణనుండి మాతృదేశాన్ని రక్షించుకోడం దేశభక్తులందరి కర్తవ్యమని నమ్ముతున్నానని స్పష్టపరచాడు. భారతప్రజల సంపూర్ణ సహకారంతో శత్రువును త్వరలోనూ, సులభంగాను ఓడించి విజయం సాధించగలమన్నాడు. జాతీయ నాయకులను, దేశభక్తులను జైళ్ళలో పెట్టి ప్రజాసహకారానికి ప్రభుత్వం ఆటంకాలు పెడుతూందని ఆక్షేపించాడు.

1943 ప్రారంభంలో పృధ్వీసింగును ప్రభుత్వం విడుదలచేసింది. వ్యాయామ మండలిని నడుపుతూ పృధ్వీసింగు ఎప్పటివలె దేశభక్తి

ప్రచారం చేస్తున్నాడు. యువకులకు శరీరపుష్టిని సాధించే మార్గం బోధించుతున్నాడు. స్వాతంత్ర్య సంపాదనకొరకు యువకులు ఎలాపోరాడాలో నేర్పుతున్నాడు. తన జీవితానుభవంనుంచి యువకులు దేశసేవాదీక్షను పూనునట్లుగా చేస్తున్నాడు.

## పెండ్లి

వ్యాయామమండలిలో పనిచేస్తూండగా పృధ్వీసింగుకు ఒక గుజరాతీ యువతితో పరిచయం ఏర్పడింది. ఆమె హిందూస్థాన్ సేవాదళ బాలికలకు వ్యాయామశిక్షణనిచ్చే ఉపాధ్యాయిని. పేరు ప్రభావతీదేవి. వారి పరిచయం ప్రేమగా మారింది.

1943 అక్టోబరునెలలో పృధ్వీసింగు ప్రభావతీదేవిని పెండ్లాడాడు. పెండ్లినాడు బొంబాయిలోని కాంగ్రెసువాదులు, గుజరాతీ దేశభక్తులు హాజరయ్యారు; సుప్రసిద్ధ పత్రికాధిపతి అమృతలాల్‌సేట్ దంపతులను ఆశీర్వదించాడు. అదివరకు ఎన్నో సంవత్సరాలనుంచి పృధీసింగును ఎరుగుదునన్నాడు: దేశంకోసం జీవితం అర్పించిన దేశభక్తుడని తెలుసు. కాని కామ్యూనిస్టుపార్టీ సభ్యుడని ఎరుగనన్నాడు. అతని పెండ్లికి వచ్చి ఆశీర్వదించాలసి వస్తుందని ఎన్నడూ వూహించనైనా లేదు. మాగుజరాతీ పిల్లను సుప్రసిద్ధ దేశభక్తునికి కన్యాదానం చేస్తున్నందులకు గర్వించుతున్నానని వధూవరులకు అభివందనాలు తెలిపాడు.

## ఆంధ్రదేశ సంచారం

1943–44 సంవత్సరాలు భారతప్రజలకు పరీక్షాదినాలు. క్షామం! ఎచటచూచినా క్షామం! ఆకలిమంటలు దేశమంతావ్యాపించాయి. ముఖ్యంగా బెంగాలు రాష్ట్రంలో కరువు మహామారి 35 లక్షల ప్రజలను తన పొట్టను పెట్టుకొంది, 75 లక్షల కుటుంబాలు విచ్ఛిన్నమయాయి. 1892 తరువాత యింతటి కరువు భారతదేశానికి ఎన్నడూ రాలేదు.

అటు బర్మాలో దేశసరిహద్దునే జపాన్‌శత్రువు కాచుకొని వున్నాడు. ఇటు బెంగాలులో ప్రజలు కరువుతో మాడిపోతున్నారు. సామాజిక జీవితమే తలక్రిందులైంది. మనప్రజలను ఆకలిబాధనుండి రక్షించుకోడమే

దేశభక్తులకు తక్షణకర్తవ్యమైంది. మరీ నిస్సహాయదశలో వున్న సోదర బెంగాలు ప్రజలకు సాయంపంపడం భారతీయులందరికిధర్మమయింది.

కా<br>మ్రేడ్ పృధ్వీసింగు సంచారంచేసి బెంగాలు ప్రజలకు కరువునిధి వసూలుచేసి పంపసాగాడు. 1944 మార్చిలో బెజవాడలో జరిగిన అఖిల భారత రైతుమహాసభకు వచ్చాడు. మహాసభకు హాజరైన లక్షమంది ఆంధ్రులకు బెంగాలు ప్రజల దీనావస్థను తెలిపాడు, బెంగాలు సోదరులకు సాయంపంపమని ఆంధ్ర ప్రజానీకాన్ని అర్థించాడు.

రైతుమహాసభ అనంతరం కామ్రేడ్ పృధ్వీసింగ్ కృష్ణా, గుంటూరు, పశ్చిమ గోదావరి, తూర్పు గోదావరి జిల్లాలలో సంచారం చేశాడు. వెళ్ళిన అన్ని పట్టణాలలో ప్రజలు వీరుడగు దేశభక్తునికి సుస్వాగత మిచ్చారు. పృధ్వీసింగు నేటి పరిస్థితులలో భారతస్వాతంత్ర్యాన్ని సాధించడానికి సరియైన మార్గమేదో తెలిపాడు. కాంగ్రెసు దేశభక్తులతో చర్చించాడు. జపాన్ దురాక్రమణదారులనుండి దేశాన్ని రక్షించుట, ఆకలి మంటలనుండి ప్రజానీకాన్ని రక్షించుట నేడు దేశభక్తులందరి కర్తవ్యమని నొక్కిచెప్పాడు. క్షామదేవతకు ఆహుతి అవుతున్న సోదర బెంగాల్ ప్రజలకు సాయంచేయమని కోరాడు. ఆంధ్రులు యీ వీరుని పిలుపుకు ఆదరంతో సమాధానమిచ్చారు. ఆరువేల రూపాయలకు పైగా పృధ్వీసింగు సంచారంలో బెంగాలుప్రజల సహాయనిధికి పంపబడింది.

ఈవిధంగా భారతమాత వీరపుత్రుడు పృధ్వీసింగ్ ఏమరపాటు లేకుండా భారతప్రజల సేవచేస్తున్నాడు. తన జీవితాన్నంతటినీ మాతృదేశసేవకు అర్పించాడు. విప్లవ జీవితంలో అనుభవించిన కష్టాలు పృధ్వీసింగును మరింత దృఢమనస్కుని చేశాయి. రాజకీయ జీవితంలో సంపాదించిన అనుభవం అతనికొక పాఠం నేర్పింది. ప్రజాసామాన్యంలో చైతన్యం కలిగించడాన్ని విప్లవకారులు తమ ప్రథమకర్తవ్యంగా ఎంచాలి. ఏ మహావిప్లవం అయినా జయించడానికి, ఏ మహత్కార్యాన్నైనా సాధించడానికి, ఏ ఆదర్శమైనా అమలుజరుపడానికి ప్రజలు ముందుకు రావాలి. ప్రజాసామాన్యంపైనే విప్లవవిజయం ఆధారపడివుంది.

ప్రజాసేవ, ప్రజా చైతన్యం కలిగించుట, ప్రజా సైన్యాన్ని నిర్మించుట, ఇవే విప్లవకారుని కర్తవ్యాలు. పృధ్వీసింగ్‌జీ విప్లవకారుడు. ప్రజాసేవకు తన జీవితాన్ని అంకితంచేశాడు. అట్టి భారత స్వాతంత్ర్య యోధునికి మన విప్లవాభివందనాలు.

# పృథ్వీసింగు జిందాబాద్



పృథ్వీసింగ్ జిందాబాద్
ఇన్‌క్విలాబ్ జిందాబాద్
రైళ్ళనుండి జైళ్ళనుండి
దూకులాడి దాటులాడి
పల్లె పట్టు ఎల్ల మెట్టి
సంకెళ్ళను సడలించిన॥ ॥పృథ్వీ॥

గదరుపార్టి నాటనుండి
అదరగొట్టి శత్రువులను
భారత విప్లవోద్యమమున
క్రాంతిరేఖ వెలయించిన॥ ॥పృథ్వీ॥

దేశదాస్య శృంఖలముల
త్రెంచివేయ దీక్షబూని
అదురులేక బెదురులేక
కత్తిదూసి దూకినట్టి॥ ॥పృథ్వీ॥

సోవియట్టు రష్యాలో
కమ్యూనిస్టు తత్వమెరిగి
జాతినై క్యపరచుకొరకు
సాగి ముందునిలచినట్టి॥ ॥పృథ్వీ॥



90

— విద్వాన్ ప్రయాగ



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA125B186 |
| పుస్తకం పేరు | సర్దార్ పృథ్వీసింగ్ |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 95 |
| పెద్ద సైజు పేజీలు | |
| ఖాళీ పేజీలు | NO |
| | NO |
| తయారు చేసినది | Rakshana |
| పేజీలు విడదీసినది | Raksha |
| Scan | Ch. Ramya |
| పరీక్ష చేసినది | THASIN |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good. |